# అంకితము

కవితా ప్రియులు

రాజనీతివిదులు

సహృదయులు

శ్రీ తెన్నేటి విశ్వనాథంగారికి

మల్లాది శివరాం

# క ను వి ప్పు



## పాత్రలు

| | |
|---|---|
| భూపాలరావు | అగ్రహారందారు. |
| గురువులు | నౌకరు. |
| సుగుణ | భూపాలరావు భార్య. |
| నాగయ్య<br>వెంకులు<br>సామేరు | రైతులు. |
| మాణిక్యం | నాగయ్య భార్య. |
| సరస | నాగయ్యకూతురు. |
| మోహనరావు | భూపాలరావు స్నేహితుడు. |
| పోతునాయుడు | సబ్ యిన్‌స్పెక్టరు. |
| అల్లం | కానిస్టేబులు |
| కుశాల్జీ | మార్వాడీ. |
| రమణయ్య | భూపాలరావు వ్యవహర్త. |
| సిలార్ | భూపాలరావు నౌకరు. |



# క ను వి ప్పు

## ౧వ రంగము

(భూపాలరావుగారిల్లు, సుగుణ, గురువులు రామాయణ కాలక్షేపం చేస్తూవుంటారు. సాంబ్రాణీ వత్తులు వెలుగుతూవుంటయ్యి. పూవులు పెట్టిన రామపట్టాభిషేకపటం, సరస్వతీ పీట వగైరా)

సుగుణ:— సతి పవిత్రత గూర్చి పీసమ్ము సంది
యమ్ము లేనట్టి రాఘవుడామె నిందు
చూలు దలపక అడవుల పాలుజేసె
ప్రజల యామోదమే భూమిపతికి సూటి.

తలపు వెలిబుచ్చు సర్వస్వతంత్ర ప్రజలు
ప్రజల తలపుల నెఱపు భూజాని, యతని
పనుల నాదర్శముగ గొను జనులు గల్గు
రాజ్య మొక్కటియే రామరాజ్యమగును.

భూఁ! ఏం రామరాజ్యమమ్మా!

గురు—ఏం? రాముడికన్న గొప్పరాజూ అతని రాజ్యంకన్న గొప్పరాజ్యమూకూడా వుంటయ్యా?

సుగు—అవునవును. ప్రాణతుల్యంగా ప్రేమించిన భార్యను నట్టడవుల పాలుచేసిన రాజుకన్న న్యాయపరుడు ప్రపంచంలో మరొకడు పుట్టబోడు.

గురు—నిజంగానే పుట్టబోడు. ప్రజాశ్రేయంకోసం ప్రాణతుల్యమైన భార్యనుకూడా పరిత్యజించ గలిగిన రాజు యథార్థంగా పుట్టబోడు.

సుగు—ఎవరా ప్రజ? మురికిమూటలు మోసే చాకలియేనా?

గురు—అవును. చాకలికూడా ప్రతిష్ఠగల రాజ్యంలో పరువుగల పౌరుడే. ఇంతకీ ఒక్క చాకలి నిందించినంత మాత్రాన రాముడు యీ పని చేశాడని భ్రమపడకూడదు. ఒక్క మెతుకు పట్టి చూస్తే గిన్నె డన్నమూ ఉడికిందీ లేనిదీ తెలిసినట్లుగా రాజులు ఏచిన్నివిషయం లోనుంచి ఏంగుర్తిస్తారో చెప్పలేము. ప్రజాభిప్రాయం, కల్ల, కపటంలేని అమాయకులనుండే బయటపడుతుంది.

సుగు—రామరాజ్యంలో నిర్దోషియైన సీతమ్మకు మాత్రం హక్కులు లేవు కాబోలు.

గురు—అల్పుడైన చాకలికే రాజాధి రాజును విమర్శించే హక్కుండగా పట్టపురాణి సీతమ్మకే హక్కు లుండవు? ఉన్నయ్యి కాని ఉత్తమ పౌరులు వ్యక్తిగతమైన హక్కులను సంఘశ్రేయస్సువిషయం వచ్చినపుడు పాటించరు.

సుగు—ఎంతరాజైతేమాత్రం నిర్దోషియైన భార్యను అడవుల పాలుచెయ్యడం ఆత్మవంచన కాదూ?

గురు—ప్రజామోదం రాజధర్మం. భర్తృత్వం వ్యక్తిధర్మం.
సంఘధర్మానికి వ్యక్తిధర్మం తలవంచింది. సీత పరాయి
స్త్రీ అయితే రాముని నిర్ణయము వేరుగా వుండేదేమో.

సుగు—ఎంత ప్రజామోదంకోసం అయితేమాత్రం యిట్టి శిక్ష
విధించటం దారుణం కాదూ.

గురు—శిక్ష విధించిందెవరు? విధింపబడిందెవరికి?

సుగు—విధించింది న్యాయభ్రమ కఠోరుడు రాముడు. విధింప
బడింది కల్లకపట మెరుగని నిండుచూలాలు సీతమ్మకు.

గురు—ఇది వట్టిభ్రమ.

సుగు—ఏం ?

గురు—విధించింది ధర్మకఠోరుడైన రాముడనటంలో నాకేమీ
అభ్యంతరం లేదు కాని విధింపబడింది మాత్రం సీతకు గాదు.
రాముడు తానుతనకే శిక్ష విధించుకున్నాడు. పరిణత
హృదయులు ధర్మనిర్ణయం పట్ల చేయగలిగేదంతే.

సుగు—ఏమో !

గురు—రాముడిట్లాకాక ఏమి చేయాలని మీ ఊహ.

సుగు—చాకలివాని మాటను....

గురు—పాటింపకుండా త్రోసిరాజనవలసింది- అంతేనా ?

సుగు—అవును. కొంపేంమునిగిపోయేది ?

గురు—చాకలివానిమాటేమిటి ? సకలశాస్త్రవేత్త మాటను
త్రోసిపుచ్చినా సమర్థుడైన రాజును పోయేదేమీలేదు.
కత్తిపట్టిన రాజును కాదనగలవారెవరు ? కాని ధర్మ
మార్గమే, ప్రజాక్షేమమే లక్ష్యంగాగల ప్రభువులు
ప్రజలను తృణప్రాయంగా త్రోసిపుచ్చరు. తన పౌరు

డొకడు క్షుద్రుడనే తలపే రాముడు భరించలేడు. నిజంగా వాడు క్షుద్రుడేఅయినా ఆ క్షుద్రతకు బాధ్యత తనదేననుకుంటాడు క్రమమైనప్రభువు.

సుగు—ఆహా! ఎంత ఆదర్శప్రభువు తాతా! రాముడు.

గురు—ఈ సందర్భంలో నాచిన్నతనం విషయంఒకటి జ్ఞాపకం వస్తోంది. పెదబాబుగారు పెద్దరికం చలాయించే రోజులవి. మానాన్న వాళ్ళు యిప్పుడు నాలాగే యీ యింట్లో స్వతంత్రంగా తిరుగుతూ ఉండేవారు ఒక రోజున నాకు బాబుగారిపిల్లలకు మల్లేనే 'చదువుకుందా' మని బుద్ధిపుట్టింది. ఈ యింటినిండా ఎక్కడపడితే అక్కడ పలకాబలపాలూ కాగితాలూ కలాలు పారేసి ఉండేవి. ఒక పలకా గుప్పెడు కాగితాలూ యింటికి పట్టుకుపోయినాను దొంగతనంగా. ఎవరు తీశారంటే ఎవరుతీశారని తర్జుమా వచ్చింది. పాపంకాస్తా బయటపడింది. సిగ్గుతో కుంచించుకుపోతూ నేను ఒకమూల నిలబడినదృశ్యం యిప్పటికీ నాకండ్లకు కట్టినట్టుంది. పెదబాబుగారు వచ్చారు. అందరూ ఒక్కుమ్మడిగా నామీద దుమ్మెత్తిపోశారు. వాడికిలేనివస్తువు వాడు తీసుకున్నాడు. ఇన్నాళ్ళమట్టీ యివ్వకపోవటం మనదే తప్పని అన్నారు. మరికొన్ని కాపీపుస్తకాలూ, వాచకాలూకూడా యిచ్చిపంపారు. రాముడు యీ వంశం వారికి ఆరాధ్యదైవము.

సుగు—వెనకటి తరంవరకూ.

గురు—లేదమ్మా! చినబాబుగారు మాత్రం దీనికి భిన్నంగా

ఎట్లా వుంటారు? గొప్పగొప్ప చదువులకోసం యిన్నా ళ్ళూ పట్టణాల్లో వుండిపోయారు. నాచేత నయినట్లుగా యింటి వ్యవహారాలు చక్కపెట్టాను. వారిసొమ్ముతో పెరిగిన ప్రతి కండరాన్నీ వారి క్షేమంకోసం కరిగిం చాను. నేనూ పెద్దవాణ్ణయినాను. వారూ యిల్లు చేరారు. ఇక రామా కృష్ణా అనుకుంటూ బ్రతికిన నాలుగురోజులూ వెళ్ళబుచ్చుతాను.

సుగు——దానికేం తాతా. కాని,

గురు——కానీ కాదమ్మా. ఎవరి ఆస్తిపాస్తులు వారు చక్కపెట్టు కోటం మంచిది. మనస్సుకు ఒక తీరమూ లేదూ.

సుగు——మీ బాబుగారికి

గురు——మా బాబుగారికి గట్టిగా చెప్పుతాను. వారుండి యిక్కడి పనిపాటలు చూచుకుంటే చూచుకొన్నట్లు లేకపోతే రోజులు ఈతీరుగా గడువవు.

సుగు——వారిమనస్సు యింకో తీరుగావుంది.

గురు——ప్రయోజనం లేదమ్మా. ఏదోఒకటి నమ్ముకోవాలి. తండ్రులు సంపాదించిన కొండ్రనే నమ్ముకుంటారో, తాను సంపాదించిన చదువులే నమ్ముకొంటారో.

సుగు——నాకుకూడా నేల విడిచినసాము యిష్టంలేదు.

గురు -- ఇదేవిషయం రామాయణంలో.........

[ ప్రవేశం భూపాలరావు ]

భూపా——ఊం. రామాయణంలో?

గురు——రామాయణంలో అనేక గొప్ప విషయాలు ఎంతో గొప్పగా చిత్రింపబడిన య్యంటున్నాను బాబూ.

భూపా—అవునవును. కోతులు, కొండలు, పదేసితలకాయలు మైళ్ళపొడుగు తోకలు చాలా పెద్దవిషయాలు చెప్పబడినయ్యి.

గురు—అవన్నీ విషయచిత్రణ కొరకు.

భూపా—అవును అవన్నీ విషయచిత్రణ కొరకు. యివన్నీ చాదస్తానికేను. యీ తలా తోక లేని రామాయణాలు భారతాలే మన కొంపతీసినై. Rational గా వ్రాయబడిన ఏ తుక్కుపుస్తకమైనా యీ రామాయణంకన్న నయమే. Sex గౌరవం తెలియని Fools.

గురు—ఏంగౌరవం తెలియని Fools?

భూపా—ఎవడో Damm Washerman ఏదో వాగాడని Wifeను అడవుల్లోకి పంపుతాడా? స్త్రీలు కేవలం పురుషుల ఆటబొమ్మలా?

గురు—కైకమ్మ అడగటమే తడవుగ దశరథుడు మూడు మహావరాలు యిచ్చివేశాడే. ఇదికూడా స్త్రీజాతిని నిర్లక్ష్యము చెయ్యడమేనా బాబూ!

భూపా—Downright గా అంతే. అసలు దశరథుడికి రాముడు రాజ్యం చెయ్యటం యిష్టం లేదనుకుంటాను. ఎవరో Damm fool ఏదో అడిగిందని పెద్ద ధర్మపరుడులాగా కొడుకునుఅడవికి పంపటమేమిటి. పొమ్మని అనే అనటంతోనే mufflలాగా యీరాముడు అడవికి పోవటమేమిటి? Most idiotic Quitxotic.

గురు—మీరన్న చివరమాటలు నాకు తెలియవుకాని బాబూ మీరు రామాయణం కేవలం తల్లక్రిందులుగా అర్థం

'పసుకుంటున్నా రని మాత్రం చెప్పగలను. ఆ మహా గ్రంథంలో...

భూపా—చాల్లేనోయ్.

సుగు—మానవ జీవితాల్ని కాచి వడపోసి...

భూపా—నీకే చెప్పేది.

సుగు—ఏదో పనివుంది. వెళ్ళాలన్నావుగా తాతా!

సుగు—వెళ్ళానమ్మా వెళతా. కాని రామాయణంలో (వెళ్లను)

భూపా—ఈ పచ్చి ఆదర్శాలతోనే జాతి చచ్చిపోయింది. అడవికి పొమ్మనేందుకు నువ్వెవడవని అనలేని రాముడు idealగా పెట్టుకుంది కాబట్టి జాతికి నాటినుండీ నేటి దాకా దాస్యం తప్పింది కాదు. అనుమానంతో అగ్ని పరీక్షకూడా చేసుకున్నావుగదా యిప్పుడు నన్ను అడవికి పంపిస్తావేమిటి అని నిగ్గదీసి అడుగలేని నోరుచచ్చిన భార్యతో కాపురం చెయ్యటంకూడా కష్టమే. నాకీ ఆదర్శాలు కేవలం చప్పగా నీరసంగా వుంటయ్యి. వట్టి Feminine ideals.

సుగు—మీరు లక్ష్యించే నిర్దిష్ట మార్గమేమిటి?

భూపా—సుఖము, సంతృప్తి, నిత్యనవీనమైన ఆనందం. యివి లేని ఆదర్శాలూ, ఆచరణలూ అన్నీ నిరర్థకం. ప్రతి మానవుడూ వీలైనంత సుఖం అనుభవించటానికి తగిన మార్గం చూచుకోవాలి.

సుగు—అందరూ సుఖాన్వేషణలో పరుగెత్తేవారే అయినపుడు ఒకరికొకరు ప్రతిబంధక మైతేనో?

భూపా—అపుడు Survival of the fittest. ఎవరికిబలం

వ్రాసే వారు గెలుస్తారు. బలహీనత నశిస్తుంది.

సుగు—ఇక ధర్మానికి తావెక్కడ ?

భూపా—బలాన్ని ధర్మంగా చూపిద్దామని చేసే వెఱ్ఱిముఱ్ఱి ప్రయత్నాలేగాని నిజంగా ధర్మంఅంటూ ప్రపంచంలో ఎక్కడా లేదు. బలం అనేదానికే ధర్మంఅనే ప్రమాదం లేని తియ్యనిపేరు పెట్టుకొని ప్రజలు దేవతార్చన పెట్టెల్లో పూజించుకుంటూరు.

సుగు—స్వార్థంలేని కార్యాచరణ మీరు ఊహింపలేరు.

భూపా—అసలు అట్టిది ప్రపంచంలోనే లేదు గనక.

సుగు—మాతృప్రేమ లేదా ?

భూపా—అదికూడా Selfish Motive లోనే పుట్టుతుంది. పిల్లలు పెరిగి తన్ను పోషించాలనే తల్లి పెంచుతుంది. తన గొంతు కోస్తారనుకుంటే ఏతల్లీ ఏ పిల్లనూ పోషించదు

సుగు—అందుకనే మీకు రామాయణం అడివిగోదుగా ఉంటుంది

భూపా—అందరికీ అడివిగోదుగానే ఉంటుంది. అర్థం అయిందంటే అదోగొప్పఅనుకొని అయిందని కోస్తారు. ఈ ముసలాడికి కూడా అర్థంఅయిందీ ?

సుగు—గురువులు చాలా సంస్కారం కలవాడు. జీవితాన్ని ఒకలక్ష్యంతో ఒక నిష్ఠతో గడిపినవాడు. చదువుకూ, సంస్కారానికీ సంబంధంలేదు.

భూపా—అవును. మా చదువులు నీ కంటికి కానవు.

సుగు—నా అభిప్రాయంఅదికాదు. గురువులు చిత్తసంస్కారం కలవాడని నా తాత్పర్యం.

భూపా—నీ పురాణకాలక్షేపానికి వస్తాసికాదూ. అందుకని అతడో Great Pandit.

సుగు—అతడెన్నో తెలియని విషయాలు చక్కగా బోధిస్తాడు వాటికి నిత్యజీవితంలోగల పొత్తును చక్కగా ఉదహరిస్తాడు. నిజంగా ఈపాటి పెద్దదిక్కు......

భూపా—ఈ పెద్దదిక్కులే కొంపలు కూల్చేది.

సుగు—అయ్యో! అతనేంచేశాడు?

భూపా—నా జీవితం యింత శుష్కంగా తయారవటానికి ప్రక్కనున్న ఈ మరుభూమే కారణం. నా ఆనంద స్రోతస్సులన్నీ యీ యిసుక ఎడారిలో యింకిపోతున్నయ్యి.

సుగు—నాకేమీ బోధపడటల్లా.

భూపా—బోధపడదు. బోధపడటల్లేదనే నేనూ అంటున్నాను. నీకు నామాటలు బోధపడవు. ఒక తెరమీద రెండు సినిమాలు ఆడటం కష్టం.

సుగు—నేనేమీ తెరనుకాను.

భూపా—ఆవిషయం తెరకు తెలియదు.

సుగు—మీరు భ్రమపడుతున్నారు.

భూపా—ఈ భ్రమను తొలగించుకోవాలనుకుంటున్నాను. ఈ రోజునుండి గురువులు మనయింట్లో పనిచేయుడు.

సుగు—అయ్యో! ఎందుకని?

భూపా—నీ కిప్పుడు చెప్పినా అర్థంకాదు.

సుగు—మనల్ని నమ్ముకుని యీ ముసలితనంవరకు...

భూపా—జన్మంతా యిక్కడ పోషిస్తామని హామీయిచ్చామా?

సుగు—యిప్పుడికీ ముసలితనంలో ఎక్కడికి పోతాడు ?

భూపా— చెప్పవలసిన బాధ్యతగాని, ఆలోచించవలసిన అవసరంగాని రెండూ లేవు నాకు.

సుగు—ఇప్పుడిక ఏంపని చేసుకొని అతడు జీవించగలడు ?

భూపా—అతణ్ణి పుట్టించాడనుకునే బ్రహ్మకు తెలియాలి.

సుగు—ఇది అధర్మం. ఏరుదాటి తెప్పతగులబెట్టరాదు.

భూపా—నేనేట్లోనూ లేను; వీడు తెప్పా కాడు.

సుగు—అతడు తాపత్రయపడకపోతే మనం యీపాటికి ...

భూపా—ఏమైపోయే వాళ్ళమో—ఎవరోయ్ అక్కడ—

(ప్రవేశం గురువులు)

గురు—బాబూ పిలిచారా?

భూపా—అవును. ఇవ్వాళ్ళనుండి నిన్ను మా నౌకరీనుండి తొలగించాము.

గురు—ఏం చేశాను నేను.

భూపా—ఏమీ చెయ్యలేవనేను నువ్వు. నీకు విజ్ఞానం ఎక్కువై సత్తువ ఉడిగింది.

సుగు—నువ్వు నీ జరుగుబాటు విషయంలో చింతించనక్కర్లేదు తాతా. మామూలు ప్రకారం యిక్కడనుండి బత్తెం తీసుకొనిపోతూవుండు.

భూపా—(మిట్టి మిట్టి సుగుణవంక చూస్తాడు.)

గురు—వద్దమ్మా వద్దు. ప్రేమతో పెట్టేబిచ్చంగూడా అమృతంగా తినగలనుగాని జాలితో దిక్కులేనివాడని పెట్టే అమృతంగూడా నాకు విషంలాగా ఉంటుంది. నారు పోసినవాడు నీరు పొయ్యకపోతాడా. నన్ను గురించి

ీ చారించవద్దు తల్లీ !
భూ వా—ఈ పిచ్చి వేదాంతాల కేం లే.

(గురువులు ఉద్వేగంతో వెళ్ళిపోదలచి మళ్ళీ గోడమన్న పెదబాబు ఫొటో చూసి కళ్ళు మూసుకొని నమస్కరిస్తూ నిలబడిపోతాడు. భూపాల రావు తలుపటాయిస్తూ)

భూపా—వట్టి ఎత్తువడ్డ నీతులు—[చప్పరించి నిష్క్రమణ]
గురు—(కళ్ళు తెఱచి తేరిపార చూచి) శెలవు సుగుణమ్మగారూ
సుగు—నీకు చాలా అన్యాయం జరిగింది తాతా !
గురు—నా దేముంది లే అమ్మా ! ఏకాకిని. నన్ను కన్నవాళ్ళు లేరు. నేను కన్నవాళ్ళు లేరు ఏ పంచన కాలం వెళ్ళదీస్తే కాదు ? కాని

దొడ్డిలో పుట్టి పెరిగిన గొడ్డునైన
ముసలితనమున విడనాడ డసలు రైతు
జీవితము ధారపోసిన సేవకుండు
సారముడిగినయంత నే భారమాౌనె ?

యీ వ్యవస్థ అక్రమం. అనుభవ లోగాని విషయం అర్థం కాదన్నది యీనాడు నాకు బోధపడింది.
సుగు—వారి మాటల కేంగాని తాతా నేను వారు చూసో చూడకో నీకు కావలసిన ఏర్పాటు చేస్తాను. కాదనక—
గురు—అది యీ యింటా నావంటా లేని సంగతమ్మా. గురువులు ప్రాణమైన వదలగలడుగాని దొంగకూడు జాలి తిండి తినలేడు.

ప్రక్కలాడించి చెమటోడ్చి డొక్కనింపు
కొంటినేగాని నేటికి గూడ నొకరి
చేయిజాపి యెంకింత యాచించి యెరుగ
చావుకాలాని కిప్పుడేల లావువగవు.

సుగు—ఇన్నాళ్ళనుండీ కంటికి రెప్పలాగా కనిపెట్టుకు నున్నావు. వా రేవేవో కొత్త విషయాలు చెప్తారు. నాకు నచ్చవు. వారికో అసంతృప్తి. వారికిక్కడ వుండటమే యిష్టంలేదు. ఏంచెయ్యాలో తోచకుండావుంది.

గురు—వారిని అభ్యంతరం పెట్టకమ్మా. అడ్డుకొన్న కొద్దీ ఉద్వేగం పెరుగుతుందేగాని తగ్గదు. మీకేమమ్మా మహారాజులు. ఎక్కడుంటే జరిగిపోదు మీకు. ఈ తాతనుమాత్రం ఎప్పుడన్నా జ్ఞాపకం చేసుకోండి.

సుగు—ఎంతమాట తాతా! నీకుజరిగిన అన్యాయం జన్మలో మరిచిపోలేను. (కన్నీరు పెట్టుకుంటుంది)

గురు—నన్ను గురించి దుఃఖపడతా వెందుకమ్మా పిచ్చితల్లీ. నాకింతలో వచ్చిపోయిన ముప్పేముంది! అరవైయేళ్లు సుఖనిద్ర పోయిన నాకీ మెలకువ మంచికే వచ్చింది. పెదబాబుగారు నాపట్ల చూపిన ఆదరణా, చినబాబుగారి పట్ల నాకున్న వాత్సల్యమూ నన్నిన్నాళ్ళు కట్టి వుంచినయ్యీగాని లేకపోతే ఏకాకికి నాకెక్కడ వెళ్ళబోస్తే పోవురోజులు! మీరూ మీరూ ఎక్కడో ఒకచోట సుఖంగా వుంటే అంతేచాలు నాకు తల్లీ!

సుగు—ఎప్పుడన్నా కనపడతావా తాతా! దేశం వదిలిపెట్టి వెళ్ళిపోతున్నాం గదా! ఇకనువ్వు కనపడవా?

సా—నేనుసుగాత్రం దేశం తెగించి పోతానాఅమ్మా! వెళ్లొస్తాను తల్లీ. పెదబాబుగారిఆజ్ఞ సుగ్రీవాజ్ఞగా శిరసావహించాను వారు లేకపోయినా యన్నాళ్లు వారి కాలిబాటలో నడిచాను. చినబాబుగారి ఆజ్ఞకూడా నాకు అంతగా పాటించవ దగిందే. వారిశెలవైంది. ఇకనాకు శెలవు తల్లీ—శెలవు—శెలవు. (నమస్కరించిప్రస్థానం)

సుగు—'తాతా' (అని రెండడుగులు ముందుకు వేస్తుంది)

(భూపాలరావు వేరొక వైపునుండి ప్రవేశం)

భూపా—సందిగ్ధంలో పడ్డావు.

సుగు—లేదు. హైందవ వనితకు సందిగ్ధం లేదు. మార్గం సర్ద్రిష్టమే.

భూపా—I dont believe all such nonsence. నాకా నమ్మకాలేమీ లేవు.

సుగు—మీకు నమ్మకం లేనంతమాత్రాన నా నమ్మకాలు మారవు.

భూపా—ఎవరినమ్మకాలు వారికుండటం వ్యక్తిత్వము.

సుగు—తన నమ్మకాలు బాధ్యతగల విజ్ఞులనిర్ణయానికి లోను చెయ్యటం వ్యక్తిత్వాన్నిమించిన మానవత్వం.

భూపా—నీకా ముసలాడిమాటలు పట్టుపడ్డయ్యి.

సుగు—అతని చేతలు పూర్తిగా పట్టుపడనందుకు నావిచారం ఎన్నడూ పోదనుకుంటాను.

భూపా—ఎవరి Culture నుబట్టి వాళ్ళలాగే అనుకుంటూ వుంటారు.

సుగు—అది యథార్థం. అరవై సంవత్సరాలు తన పెన్ని

ధిగా ఎంచుకొన్నది అకస్మాత్తుగా మట్టిపెళ్ళఅని తెలిసినప్పు డుగూడ అది విధి నియతిగా భావించుకొని హృదయోద్వే గాన్ని ఆపుకొగలిగిన అతని సంస్కారం—మంచో చెడో గాని ఒక ప్రత్యేకతమాత్రం కాకపోదు.

భూపా—చివికి జీర్ణించిపోయిన ఆదర్శాలను పూజించేవారు అంతకన్న మరొకటి చేయలేరు.

సుగు—చూడడానికి జడులూ జ్ఞానులూ ఒకటిగానే వుంటారు

భూపా—మన యీవాదం అనంతంగా వుండిపోవలసిందేనా?

సుగు—లేదు నేను యుద్ధానికి దిగను. ఇక అస్త్రసన్యాసం చేస్తూన్నాను మాటలలో చేతలలో మిమ్ము అనుసరి స్తాను మనస్సుతో మిమ్మనుసరించ టానికి ప్రయ త్నిస్తాను.

భూపా—నీపరిష్కారమార్గం నాకాటే బాగుండకపోయినా నిర్ణయమాత్రం నాకు కొందగినదే.

సుగు—మీరు భౌతిక వాదులేగాని ఆధ్యాత్మిక వాదులు కారుగా.

భూపా—నాకీ పల్లెటూరి వాతావరణంనచ్చదు. జీవితం యీ యెడారులలో యిరికిపోవటం నాకిష్టం లేదు.

సుగు—ఈ యిళ్ళూ, వాకిళ్ళూ, పొలాలూ, స్థలాలూ యేం చేసుకుంటారు.

భూపా—అవన్నీ మనకు ఆనందం యివ్వనప్పుడు వాటినిపట్టుకు పాకులాడి ప్రయోజనమేముంది?

సుగు—ఉండి జాగ్రత్త పెట్టుకోకపోతే ఆస్తి ఒకతీరుగా వుండ దని తాత చెప్పాడు.

భూపా—తనుగాక యింకెవ్వరూ దీన్ని చక్కబెట్టలేరని వాడి భ్రమ. అయినా ఒకొక్క ప్రాణి ఒకొక్కందుకు పుట్టుతాడు. వాడట్లాగే పోతాడు. ఆటే ఆలోచిస్తే కొందరు గాడిద చాకిరీ చేసేందుకే పుట్టారేమో అనిపిస్తుంది.

సుగు—ఇంతకూ పొలంసంగతి ఏమనుకున్నారు.

భూపా—రమణయ్యగారి పరం చేస్తాను.

సుగు—ఒళ్ళు వంచలేనివాళ్ళు పొలాలేం కాపాడుతారు ?

భూపా—గురువులును ఎందుకు తీసేయాలో యిప్పుడు సరిగా చెప్తావిను. అది పరిస్థితులనుబట్టి సహజంగా జరగవలసిందే. కాబట్టి It is the natural outcome of the circumstances. ఇంతజ్ఞానం ముదిరినవాడిని పనిలో ఉంచకూడదు. జ్ఞానం, పని రెండూ కలియటానికే Revolution అని పేరు.

సుగు—మీావన్నీ పిచ్చిఊహలు. తాడునుచూచి పామను కుంటున్నారు.

భూపా—నువ్వే పామునుచూచి తాడనుకుంటున్నావు.

సుగు—గుండెన్నా చెదరకుండా ఉంటుంది.

భూపా—అదుగో పొరపడ్డావు. మనకూ చెదరదుగుండె. కానున్న విషయాలు కాకమానవు. వాటికోసం గుండె చెరువుచేసుకోటం మనం ఎరుగం. వీలైనంతవరకు రాబోయే ప్రవాహం అడ్డుకోటమే మనపని. అంత వీలు తప్పితే తెల్లజండా ఎత్తి హరోంహర అని ప్రవాహానికి వాలుపడటమే.

సుగు — ఏ ఎండకాగొడుగు పట్టటమనేది ఒక సిద్ధాంతం కాదు.

భూపా — అన్ని సిద్ధాంతాలకు అదిసారము.

సుగు — మీదంతా వితండవాదం.

భూపా — సుగుణా ! మనకీ వితండవాదం అనుక్షణం తప్పదా ? నువ్వు అన్నింటిలోనూ నాదానివి కావాలని ఆశిస్తున్నాను.

సుగు — ఎదురుతిరుగుదామని అంతర్యంలో నిజానికి నాకూ లేదు ఏదో యీ సమయానికి నడచిన ఈ వివాదంలో మీకేమైనా కష్టంకలిగించే మాటలుమాట్లాడానేమో క్షమించండి. నేను అక్షరాలా మిమ్మే అనుసరిస్తాను. మీరు చదువుకున్నవారు. దేశాలు తిరిగినవారు. మీ మాట కాదని నేను చేయవలసిందిగాని చేయగలిగింది గాని ఏమీలేదు.

భూపా — మన ఆనందానికి భంగమయ్యే పనులు నేనే మీ చెయ్యను సుగుణా ! సరే రేపటెల్లుండిలో పట్నానికి ప్రయాణం అక్కడ క్లబ్బులు, పార్కులు, సినిమాలు, షికార్లు, మాంచి Lovely Society అన్నీ ఉంటయ్యి ఈ నాటుమోటుగ్రామంలో ఎన్నాళ్ళనిఉంటాం. అన్నీ సిద్ధంచేస్తావుగదూ ! (ప్రస్థానం)

సుగు — అన్నీ సిద్ధంచేస్తాను. అన్నీ సిద్ధంచేసి యీ చుక్కాని లేనిపడవను ఏ ఒడ్డున పట్టుకోగలనా అని ఆలోచిస్తున్నాను. అయినా చుక్కానిలేని పడవకు ఒకఒడ్డేమిటి ఒకరేవేమిటి? ఈ పడవ అనంతసముద్రంలో ఎక్కడో

ఎందుకో బయులుదేరి యింకెక్కడో ఎందుకో అంత పూతుందట! ఆహా! ఏం సిద్ధాంతం.

చెలరేగ నేదో తుఫాను
హృదయాబ్ధి కలవరముగా
వీచికా నివహా
రవముతో ॥

శోక జలధర పంక్తి
చీకట్లలమ నెదను
చీకాకునను భావ
మాకులమ్మై పోవ ॥ చెల॥

చెదర సంకల్పముల్
చెరుగ నాశా రేఖ
చలిత జీవన నౌక
చుక్కాని చెయిజార ॥ చెల॥

ఇది సమయ మెన్నటికో
ఎదతనియు టెన్నటికో
కలరవ మికెన్నటికో
ప్రమద మింకెన్నటికో॥ చెల॥

(తెర)

# కను విప్పు



## ౧వ రంగము

(వీధిలో పళ్ళు అమ్ముకుంటూ తాత)

గురు— పండ్లుకొంటారాబాబూ పండ్లుకొంటా రా.
ఇప్పుడె కోసిన యింపగు పళ్లివి
తరుణము మించని తాజాపండ్లివి
త్వరపడిరండి వేగకొనండి
వేళమించితే వెళ్ళేనండి ॥ పండ్లు॥

మధురమైన మామిడిపండ్లున్నై
చవులూరించు సపోటాలున్నై
తేనెమించు తియ్యనరటిపండ్లు
త్వరపడకుంటే దొంకవు రండి॥ పండ్లు॥

(ప్రవేశం సరస)

సరస—ఓ పళ్ళబ్బీ! మాయింటికొస్తావా!

గురు—పళ్ళు కొంటావా అమ్మా!
సరస—చాలా కావాలి
గురు—పెద్దవాళ్ళు పిలవమన్నారా!
సరస—ఊఁ మాఅమ్మేపిలవమంది. నిజంగా.ఒట్టు చూస్తావుగా
గురు—ఎవరమ్మాయివమ్మా నువ్వు? మీఅయ్యపేరు?
సరస—నాగయ్య
గురు—ఓహో నాగయ్య కూతురువా. పోదాం పదవమ్మా—

(ప్రస్థానం తెరతీయును)

(తెరతీయగా నాగయ్యయిల్లు. మాణిక్యం జబ్బుతో వుంటుంది. తెరతీసిన ఒక క్షణానికి చంకలో ఒక గోనె సంచితో నాగయ్యప్రవేశం)

మాణిక్యం—వచ్చారూ. వెళ్ళిన పనేమైంది?
నాగయ్య—ఏ మహాతుం దనుకొన్నావో అదే అయింది.

(గోనె విసరివేసి)

మా—ఇవ్వను పొమ్మన్నాడా?
నా—బకాయి యివ్వకపోగా పైపెచ్చు బదులుకొచ్చావా అన్నాడు.
మా—ఇక గడిచేయెత్తు.
నా:—గడవక రోజులు మానకోసం ఆగుతయ్యా!
మా—మనకోసం రోజులూ కూర్చోవు. రోజులకోసం మన మూ కూర్చోం.
నా:—ఒళ్ళుదాచుకోకుండా ఏటికేడాదీ చెమటోడ్చినా కూడు గుడ్డ దొరకకపోయిన తరువాత బ్రతికేం? చచ్చేం? చిల్లిదమ్మిడి గింజలుకూడా యివ్వటానికివీల్లేదని రమణయ్య గారు గద్దించినపుడు నేను నిజంగా ఒకళవాన్నే మో

అనిపించింది నాకే. ఆయనింట్లో ఎదురుగా నెట్టుగట్టే
వున్న ప్రతి ధాన్యంబస్తా నాబుజాలిమీద మోసిందే.

మా—నువ్వేమన్నావ్.

నా:—ఏమన్నా అంటే యిక్కడి కెట్లాపిస్తాను?

మా—ప్రాణాలు తీస్తాడా?

నా:—తీస్తే ఆపే దిక్కెవరు?

మా—అంత అంధేరాగా వుందా దేశం?

నా:—పిచ్చిదానా, అంతకన్న అధ్వాన్నంగా వుంది.

మా—ఇంతకీ మన కర్మానికి ఒకళ్లేంచేస్తారు?

నా:—నేనూ అదేఆలోచిస్తున్నా. మనకీకర్మ యెక్కణ్ణుంచి
వచ్చిందా అని.

మా—అదంతా తీరగ్గా ఆలోచిద్దుగాని, వెళ్ళిమందు తెస్తావా?

నా:—డాక్టేరుగారికి పైకం యివ్వలేదు మళ్ళీ మందుకెళితే
ఏమంటాడో.

మా—మందివ్వక చంపుతాడా?

నా:—మాంబాగుంది. మనల్ని బ్రతికించటానికేనా ఆయన
వైద్దిగం పెట్టుకుంది?

మా—పోయిరద్దూ. తరువాత చూద్దాం.

నా:—సరే ఆముచ్చటా తీరుతుంది పోయేవస్తా. (ప్రస్థానం)

(మరొకవైపునుంచి సరస గురువులు ప్రవేశం)

సరస—అమ్మా! అమ్మా! ఆఅబ్బిని పిలుచుకొచ్చానే.

మా—పట్టితే మొసలిపట్టేమే! యిప్పుడు విషం పుచ్చుకుందా
మన్నా ఎర్రని ఏగాని లేదుగదా! పళ్ళుకావాలంటే
యెట్లాగొస్తయ్యమ్మా!

సరస—నిన్న నువ్వేగా అమ్మా కొనిపెట తానన్నావు.

మా—కొందాంలే అమ్మా ఏడవకు.

సరస—ఎప్పుడూ యీమాటలే.నా కివ్వాళ్ళకొని పెట్టాల్సిందే

మా—తాతా! పిల్ల తెలియక పిల్చింది ఏమీఅనుకోక వెళ్ళు బాబూ.

సరస—ఆఁ వెళ్ళకబ్బాయ్! కొనిపెట్టాల్సిందే. ఆఁ. గింజలు తీసుకుంటావా తాతా!

మా—గిద్దెడు గింజలైనా వుంటే కాదనేదాన్నా అమ్మా!

సరస—పోనీ రేపిస్తాం యిస్తావా తాతా!

మా—రేపుమాత్రం ఎక్కడనుంచి తెస్తాంతల్లీ! తాతను వెళ్ళనీ అమ్మా.

సరస—నువ్వెప్పుడూ యింతే. కొనిపెట్టవుగదూ. ఆఁ. అయ్యో రమణయ్యగారింటిదగ్గర గింజలు తేస్తా నన్నాడుగా. అప్పుడిద్దాంపోనీ. ఏం తాతా సరేనా.

(నాగయ్య ఒకక్షణం క్రిందటనే వచ్చి పైమాట వింటాడు)

నా—రమణయ్యగారూ, గింజలూను. మన ప్రాణా లున్నంత వరకు గింజలురావు

సరస—నాకెవ్వరూ కొనిపెట్టరూ— ఊఁ ఊఁ ఊఁ.

నా—అమ్మాయ్. చెపుతుంటే నీక్కాదూ! ఏమిటామాటా ముఁ! తాతా! నువ్వున్నంతసేపూ యిది యిట్లాగే వేధించుకుతింటుంది. బీదపిల్లఅబ్బరాలు ఎందుకువనికొస్తయ్ బాబూ వెళ్ళునాయనా! తెలియక పిలిచింది. ఏమీ అనుకోకు. పో సరసా. పోయి పనోపాటో చూసుకో

(రెక్క పట్టి లాగబోవును)

గురు—ఆగు. నాగయ్యా! ఆగు.

పొలములు కుంటనేలకొక పుట్టిగ పండెను కోటలందునన్
ఫలములుగాచె పిచ్చిగను పాడియుచుండె సమృద్ధిగాను
వలసినవన్నియుండియును పస్తులుపండుటెయయ్యొ నేమియో
విలయము! తిండిలేక విలపించుట ధాన్యపు రాసులందునన్

తీసుకో సరసమ్మా. పండ్లు తీసుకో. ఎన్ని కావాలో తీసుకో.

నా—ఎందుకు తాతా! నీకుమాత్రం ఊరికే వచ్చినయ్యా?
(తీసుకో బోతున్న సరసను హెచ్చరిస్తూ) సరసా!

గురు—నాగయ్యా! ఇహ ఆగట్లా! తీసుకో చిట్టీ తీసుకో అమ్మా బలవంతాన నాదగ్గరనుంచి లాక్కుంటె నే నెంతో సంతోషించేవాణ్ణి. తీసుకో. (వెళ్ళి నాగయ్యను కౌగిలించుకొని) నాగయ్యా! నిన్నొక విషయమడుగుతాను. దాచకుండా చెప్తావా?

నా—దానికేం. అడుగు తాతా. మా బ్రతుకంతా బట్టబయలే.

గురు—పిల్లలూ మీరూ అన్నంతిని ఎన్నాళ్ళైంది?
(నాగయ్య తల వంచుకుంటాడు. సరస యేదో చెప్పబోతుంటే మాణిక్యం సైగతో వారిస్తుంది)

గురు—మన ఆకలి మనం దాచుకుంటున్నా మంటే అవినీతిని పెట్టెల్లో పెట్టుకొని దాచుకుంటున్నామన్న మాట. తిండికిలేక మాడుతున్నామంటే మనకుపోయే పరువేమీ లేదు. సంఘంలో సౌఖ్యం అనుభవిస్తున్న స్వాములకు పరువుపోతుంది. వారి పరువు ప్రతిష్టలకోసం మనం యింత పాటు పడక్కర్లేదు.

నా—అదేమిటి తాతా! ఏమేమిటో మాట్లాడుతున్నావ్?
గురు—ఏమీలేదు. ఈదోషం ఎక్కడున్నదా అని ఆలోచి
స్తున్నాను.
అరునదియేండ్లువచ్చి తిన నన్నము లేకయె కుందుచుంటి; నీ
వరసనహాస్ని శెల్ నడుమువంచిన నీకును తిండి లేదు; యే
మురిపెము లేకయున్న పులి ముంతల గంజికి నోచదయ్యెనీ
సరసయికేటి సంఘములు సౌఖ్యము లాకటికారుచిచ్చునా
ఇవునో (పండ్లు పట్టుకొని) నాగయ్యా నువ్వుకూడాతిను.
నువ్వా తినవమ్మా తల్లీ. సరసమ్మా నువ్వాతిను.
నా—తాతా నీకేం మతిపోలేదు గదా.
గురు—(చల్లపడి) లేదు నాయనా! అరవైయేళ్ళు మదిదప్పి చ
రించాను. ఈరోజుననే నాకు మతి అంటూ వచ్చింది.
నిజంగా యీరోజుననే ఇన్నాళ్ళు నేనెట్లా వెర్రివాణ్ణై
నానాఅనిపిస్తుంది వెనక్కు చూసుకుంటే—నాగయ్యా
ఇంత కష్టపు రోజులు గడుపుతున్నావేం నాయనా!
నా—ఏంచేసేది తాతా! యకరానికి 15 బస్తాల కవులు—
గురు—పదిహేను బస్తాలకవులు! యకరానికి!!
నా—అవును యకరానికే. వేసంకాలం అంతా గొర్రూ గోదా
కట్టేసి గట్టు గనుమూ పెట్టి చేనంతా అద్దంలాగా చే
శాను. పైరు జాయనా వస్తుండే సమయంలో చిరు
పొట్టమీద గాలివాన వచ్చింది. యకరానికి పుట్లు కా
వటం గగనమై పోయింది. కౌలు చెల్లించలేక బకాయి
పడ్డాను. ఇంటికి చేరవేసుకోని వుంటాడు. పొలంపండక

పోవడమేమిటి అన్నారు నలుగురూను. బదులన్నా వుట్టుతుందేమో ననిపోతే రమణయ్యగారు—నన్నే వచ్చి బదులడుగుతే దాచుకున్న గింజలకి కాపుగా వుంటుందనుకున్నావా! ఈ పిచ్చివేషాలు సాగవు మనదగ్గరఅన్నాడు.

గురు—ఘోరం. లేదంటంకాక అవమానం కూడానా!

బొట్టుబొట్టుగ జారినట్టి చెమ్మటలెల్ల
యజమానియాణి ముత్యములు గాగ
ఉస్సురుస్సురటంచు నూర్చు నిట్టూర్పులు
పనుపంపు కమ్మ తెమ్మెరలు గాగ
తన నోటిలోపడ్డ పెనుగడ్డ యజమాని
హాయిగా మెక్కు మిఠాయిగాగ
తనమేనికిఁ బూసికొనిన దుమ్మంతయు
అగరుగంధము లత్తరుగను మార
చేనిచుట్టును సెప్పుడు గాను గెద్దు
వోలె ద్రిమ్మరు తిరుగుళ్ళ రైలుమీద
నెడతెఱపి లేక నిటునటు నేగు కేళి
యాత్రలుగ మారు నిదియేటి న్యాయసరణి.

నా—ఇది మనకర్మం తాతా!

గురు—అనే యిన్నాళ్ళూ అనుకున్నాను. అవుననే అనిపించింది. ఇప్పుడు కాదనుకుంటున్నాను. కాదనే ఋజువౌతోంది. ఇది మనకర్మమని మనమే ఒప్పుకున్నాం కాబట్టె యిన్నాళ్ళూ యితరులు చేసిన తప్పేమీ మనకు కనపడలా. మనదారిద్ర్యం పోగొట్టుకోటానికి ప్రాణా

లర్పించేందుకు మనం సిద్ధపడలా. అందుకని అదిపోలా

గా—ఏం చేద్దామంటావు?

గురు—చెయ్యవలసిందేదో చేసే చూపిస్తాను.

బీటవారిన సంఘపుకోట నేడో
రేపో కూలగ మానదు నే పునాది
రాయి నౌదును నూత్న హర్మ్యమ్మునకును
పొయెదనుగాక రాళ్ళను ప్రోవుచేయు

(పోట్లాడుదు)

సరస—తాతా! గంప!

గురు—అవసరంలేదా కంప. గంపతో ఋణంతీరిందమ్మా!

మా—బేరంచేసుకోవా! తాతా!

గురు—ఇక చేయబోయే బేరం యిదికాదమ్మా.

అక్కడక్కడి చిరుమంటలన్ని కూర్చి
పేర్చెదనుగాక రొకచోట పృథ్విలోని
యపకతవకల కరిగి న్యాయంపుమూస
యందు తీరుగ పోతపోయంగ నేడె. [ప్రస్థానం]

(తెర)

# క ను వి ప్పు



## ౩ వ రంగము

పట్టణం. భూపాలరావు బంగళా. మంచి ఫర్నిచర్. భూపాల రావు ప్రవేశించి గదినాలుగువైపులా పరికించి చూస్తాడు.

భూపా—(బెల్ కొట్టగా ఎవరూ పలకరు.)

భూపా—(మరల బెల్ జవాబురాదు)

భూపా—(బెల్ కొట్టుతూ) సిలార్

ఆయా సాబ్ (అని లోపలనుంచి పొలికేక)

సిలార్—ఆయాసాబ్.

భూపా—నువ్వొకేసారె రెండుతప్పులు చేశావ్

సిలార్—హాఁ సాబ్

భూపా—హాఁ సాబ్ ఏమిటి?

సి—తెల్వక చేశాన్ సాబ్.

భూపా—ఏమిటవ్వి?

సి—నా కేం తెల్సుసాబ్. తెలిస్తే చేస్తానండీ మల్లీ.

భూపా—ఒకటి బెల్ కొట్టంగానే నువ్వు రాలా. రెండు మూడు సార్లుకొట్టినా రాలా.

సి—మాయింట్లో వెధ్వాపిల్లలూ సైకిల్ గంటా గణాగణా మోస్తూ మోగిస్తూఉంటే అలవాటై పోయింది సాబ్. ఇది పిల్చినట్టే వుండదూ హయ్యా!

భూపా—చాల్చాలు. పోనీ పిల్చినప్పుడైనా మెదలకుండా రాక ఆయాసాబ్ అని ఒక పొలికేకపెట్టావ్. ఇది మొదటి దానికంటె పెద్దనేరం. ఇక్కడికి అనేకమంది పెద్ద మనుష్యులువస్తారు. నీ పొలికేకలు వినటానికిరారు వాళ్ళం దరూ.

సి—లేదుహయ్యా. సిలార్ పాణం పోయినా నామర్దా పని సెయ్యడు.

భూపా—ఇదుగో చూడు. ఈ ఫొటోలు యిట్లాపెట్టావేం.

సి—హేమైంది సాబ్.

భూపా—ఈ గాంధిగారి ఫొటో ముందు పెట్టావేం?

సి—నాలాసాలా గొప్పవాడని ముందు పెట్టాణ సాబ్.

భూపా—అదే పొరపాటు. గాంధిబొమ్మ మొదటవుండ గూడదు.

సి—ఆమాటంటే ఆఖర్కి—పారేస్తాణ సా.

భూపా—అదుగో అదీ పొరపాటే. నీకేం తెలీదు.

సి—హాఁ సాబ్

భూపా—ఏడిచినట్టేవుంది. హాఁ సాబ్ హాఁ సాబ్

ప్రవేశం మోహన్

మో—ఏమిటోయ్ తర్జుమా పడుతున్నావ్.

భూపా — చూడు వీడు గాంధీబొమ్మను తెచ్చి మొదట పెడ్తాడు

మో—మంచిదేగా. ఆయన ప్రపంచాన్నంతనీ Lead చేసిన ఘనుడు కాబట్టి మొదట పెట్టటం సమంజసమే అయినా ఫోటో ఎక్కడుంటే ఏం కొంపమునిగిపోయింది ?

భూ పా—అక్కడే నువ్వూ పొరపడ్డావు. వీలైనంత అనుభవించాలని నామతం. వీలుతప్పితే గాంధిగారి ధర్మకర్తృత్వం అది Second step రెండవమెట్టు. మరీ గోడుచెడితే మార్క్సియన్ రివొల్యూషన్. అది మూడో మెట్టు. అందుకని ఫోటోలుగూడా Step వారీగా.

మో—పోనీ నీ మతానికి నువ్వే ప్రవక్తవుగా. నీ ఫోటోనే ముందు వేసుకోరాదూ !

భూ పా— That is an idia సెబాస్. నాఫోటో ముందు వెయ్యవోయ్.

సి—హాఁ సాబ్ ! (అట్లు చేసి నిష్క్రమణం)

మో—ఎవరిష్టమొచ్చినట్లువారు అనుభవించటం, యీదొంగల దోపిడి ఎన్నాళ్ళు సాగుతుందంటావ్ భూపూ.

భూపా—కరెక్టుగా చెప్పమంటావా ?

మో—ఏమన్నా ఫార్ములావుందా ?

భూపా—వోటువిలువ తెలియని అజ్ఞానులచేతుల్లో వోటు హక్కు ఉన్నంతవరకూ ఉంటుంది.

మో—ప్రజాస్వామికంలో నువ్వన్నది......

భూపా—ఇదుగో చూడు. ప్రజాస్వామికమనేది ఒక Slogan

Peoples' amotion కు ఒక appeal. దానితో వారి ఆవేశం, ఆకలి చల్లారతయ్యి. ప్రజాస్వామికం పేర నియంతృత్వం Serve చేస్తే దాన్నే స్వీకరిస్తుంది మూఢప్రజ.

మో—అయితే మనబోటివాళ్ళ కర్తవ్యం.

భూపా—స్పష్టం. To make hay while the sun shines.

మో—ఇది సంఘవినాశ మార్గంకాదూ!

భూపా—ఊఁ. సంఘం? సంఘమనేది ఒక fiction. ఒకఊహా గానం. మనకీనినాదాలు లేకుండానే కొన్ని privileges యిదివరకు నుంచీ వున్నయ్యి. అవిలేనివాళ్ళని కొన్నాళ్ళవరకూ యీనినాదాల్ని తమ స్వంతానికి వుపయోగించుకోనీ పాపం.

మో—మనబోటివాళ్ళే యిట్లా వ్రాసుకుంటే ముందుగతి ఏంకాదూ!

భూపా—ఊరుకోకపోతే మనగతి ఏంకానూ! Secular state అని పేరుగదా. మొన్న నువ్వు బ్రాహ్మడివి. Duputy collec or సెలక్షనుకు పనికిరావు పొమ్మన్నారు.

మో—నిజానికి బ్రాహ్మలు సంఘానికి చాలా ద్రోహం చేశారు.

భూపా—చరిత్రకు ఎట్లాపడితే అట్లా అర్థంచెప్పచ్చు. అన్యాయాలు నిజంగా చేసేవుంటే చేసినవారితోపాటు భరించినవారిదికూడా తప్పే! యిపుడు వీరు చేస్తున్న అన్యాయాలకు ముందుతరంవారు జవాబుదారీ వహిస్తారు కామాల్లు.

మో॰—అక్కడక్కడ కొన్ని యిలాంటి చిన్ని చిన్ని లోపాలున్నా Secular state ని బొత్తుగా తీసెయ్యకు మరి. ఈ ప్రత్యేకతలు యికనుంచి సాగవు.

భూపా—తప్పక సాగుతయ్యి.

మో—నీదంతా పెడసరి మతం.

భూపా—నిజం నిష్టురంగానే వుంటుంది. ఓటు, సెక్యులరిజం యివన్నీ చాలా ఘాటుమాత్రలు. పిల్లవాడిమీద నాభి చేసినపని చేస్తుంది వోటు అజ్ఞానుడిమీద. చావుకు వెరవనివాడికి స్వాతంత్ర్యం. సంఘక్షేమం గుర్తించినవారికి సెక్యులరిజమున్నూ. అందఃకీనా?

మో—ఆఁ. ఆఁ. ఏదో వుపన్యాస ధోరణిపట్టావు. బ్రహ్మాండమైన ఆడియన్సు ఉన్నట్లుగా.

భూపా—నాకు నువ్వే వెయ్యి ఆడియన్సు. అవకాశం దొరకినప్పుడు వదులుకో రాదన్నది మా Fundamental Rules No. 1. అన్నట్లు సుగుణ్ - సుగుణ్ - కాఫీ-

(లోపలనుంచి వచ్చేఆనుకేక)

మో—కాఫీ అయిందోయ్.

భూపా—ఇస్సు - అవకాశం దొరికినపుడు వదులుకోరాదు. F. rule No. 1.

మో—జీహుజూర్ (సుగుణ కాఫీ తో)

సుగు—మోహనరావుగారూ ప్రొద్దున్నే వచ్చారే. ఏదో క్రొత్తగా రాసుకొచ్చారల్లేవుంది.

భూపా—అన్నట్లు అరెరే. ఇందాకటినుండి నేనే ఏమీ అవకాశంయివ్వకుండా లెక్చరు దంచేస్తున్నాను. నువ్వేదో

కవిత్వం రేకెత్తి వచ్చివుంటాంవు పాపం.

మో—మరీ అన్యాయంగా వుందే మీాపని.

సుగు—కొంత న్యాయ్యం లేకపోలేదు. ఏమంటారు.

మో—ఆమాట నిజమే. ఒక క్రొత్త రచన చేశాను. భాష నాది. భావం భూపాలరావుది. శంభోఅనే మకుటంతో శతకం వ్రాశాను.

భూ-పా—Very well. Very well. నేను కవిత్వంలోకెక్కి అమరత్వం పొందుతాను.

సుగు—చదవండి- చదవండి.

మో—
లేమియు సంతానము కొఱ
గామియు పెండ్లాము కనుట కట్టుపడమియున్
ఏమీా తొలగింపక యీా
నాములు తొలగించు టేమిన్యాయము శంభో!

భూపా—భేషో భేషో జమీాందారీ యీానాందారీ ఎబాలిషన్ Unwarented and hasty అందుకే వృత్తి జూపించి reform చెయ్యగలిగితే చెయ్యి. లేకపోతే మానేసెయ్యి.

మో—
మాదిరికి మానెడటుకులు
బాదెను మాతాత నాకు పదహారొన్సుల్
సాదం బనిరంతమ్మున
కీదుమ్మారొన్సులిచ్చి రెండుకో శంభో!
అధికోత్పత్తికి మేమొక
పధకమ్మును వేసినాము ప్రాజెక్టులతో

ప్పృథపడజాలక మొదిరయే
విధి సీతలకొక్క డాయి వేయగ శంభో
నీ మెడలో పామేలా
ఆమారుని మెడను వేయవయ్యా అప్పుడే
నీ మానవ సంతానం
బేమైనస్ తగ్గునేమొ భీతిలి శంభో

భూపా— Very good నేను నీకు కవిసమ్రాట్ అనేబిరుదు యిస్తున్నాను.

మో—అది యిదివరకు చాలామంది చాలామందికి యిచ్చారు. కొందరు ఎవ్వరూ యివ్వకుండా తమంతట తామే పెట్టుకున్నారు.

భూపా—Dont mind సకలకవి సమ్రాట్ అంటానైతే.

మో—Thankyou

(ప్రవేశం సిలార్ పత్రిక నవలు వగైరా)

సి—సలాం సాబ్.

మో—ఏం సిలార్ ఏమిటీ విశేషాలు.

సి.—అంతా విచిత్రంగావుంది సాబ్. జమీందారీలు యీనాందారీలు హన్నీ రద్దు హాయినయ్యని యిందులో రాశారంట సాబ్.

మో—రద్దు కావాలంటున్నా అసలు—

సి—దాదా పర్దాదా కాలంనుండి వచ్చిన ఝమీందారీ తీసీపారావెయటానిక్కి వీడెవఢూహాండీ. ఏదైనా లేంది హివ్వాలా గానీ హున్నదాన్ని లాక్కుంటే హెవ దూరుకుంటాడండీ—

మో—వాళ్ళు అంతంత జమీందార్లుగా వుండి మనం తిండి తిప్పలకోసం తంటాలు పడుతూ వున్నాంగదా. యిది అన్యాయం గదూ.

సి—హా న్యాయం హెవడమండీ. అంతా ఖిస్మత్ సాబ్ ఖిస్మత్

సుగు — ఆ కూరలూ అవీ లోపల పెట్టిరా పో. (సిలార్ పోవును)

మో—భూపూ, జమీందారీలు ఈనాములు పోతయ్యంటావా ఈ దెబ్బతో.

భూపా—పగలు చుక్కలు పొడుస్తయ్యా!

మో—పోవంటావా ?

భూపా—ఈ ప్రభుత్వంలో పోవు. ధనికులరాజ్యంలో జమీం దారీలూ, యీనాములూ, శేరీలూ పమీపోవు. నీ వాదం Self negation.

మో—తీసేస్తామంటున్నారుగా!

భూపా—దూకుతా దూకుతా అన్న వారుఎవ్వరూ నూతిలో దూకరు.

మో—ఒకవేళ తీసేవేస్తారేమో మనకేం తెలుసు.

భూపా—తీసేస్తే డబ్బిస్తారు. అదిపెట్టిఫ్యాక్టరీలు, వ్యాపారాలు చేసుకోవచ్చు. న్యాయానికి పొలాలకన్న అదేమెలుగు.

మో—డబ్బివ్వకపోతే ?

భూపా—డబ్బివ్వకపోతే వీళ్ళ ప్రభుత్వమే నిలవదు. అపుడు ఏంచేస్తారనే మాటకే తావుండదు.

మో—నీదంతా విచిత్రమైన మొండివాదం భూపూ.

భూపా—ఈ వాదాలకేంగాని ఏదైనా Entertainment కు పోదాం పదండి.

సుగు—సినిమా

భూపా—ఎప్పుడూ చూసేదేగా.

మో—బీచికి

భూపా—ఎప్పటిపాటేగా Races కు పోదాంపదండి.

సుగు—మొన్నేగా పోయింది పదివేలు.

భూపా—పోయింది రాదనటానికి వీలులేదు.

సుగు—క్రీడించి మేలెంచమన్నారు పెద్దలు.

భూపా—క్రీడించటం పొరపాటన్నారు మా పెద్దలు. ఏదితలిస్తే అదే అవటానికి అవకాశంఉంది. F. Rule No 2

మో—నువ్వు Premier అవుదామనుకో అవుతావేమో చూదాం.

భూపా—అవుదామనుకోలేను. అనుకోను. కాబట్టే కాలేను కాను.

సుగు—అవుదామనుకుంటే కాగలరా?

భూపా—అవుదామనుకున్నప్పుడు అనుకునిమాత్రం ఊరుకుంటానా? దానికితగ్గ తిప్పలుపడనూ?

మో—నీది వితండవాదం.

భూపా—మీ అందరిదీ విచిత్రం.

మో—మనం శాంతికాములంగదా. యుద్ధం వస్తోందేం?

భూపా—మనం యుద్ధకాములమే.

మో—నేనెప్పుడూ యుద్ధం కావాలనుకోలేదు.

భూపా—నీవల్ల యుద్ధం రానేరావటల్లేదు.

మో—మరి నాకుకూడా తగులుతోందేం యుద్ధం?

భూపా—నిప్పుపక్క సెగతగలక తప్పుతుందా?

సుగు—ఏమిటో శుష్కప్రసంగాలు ఇంతకన్న మంచి విషయం దొరకలా మీాచన్నకు.

భూపా—మద్యమైనా అందించు. అదే పాడుతాము. భజనకు ఏకీర్తన ఐతేనేం. (ప్రవేశం సిలార్)

సి—మోహన్ సాబ్ కోసం హెవరో వచ్చారండి యింట్లో

మో—ఇదుగో వస్తున్నా! Good morning.

భూపా—నేనూవస్తా బజారుదాకా.

సుగు—కాలక్షేపం ఎక్కడైతేనేం.

భూపా—Quite so enjoy enjoy enjoy.

(ప్రస్థానం)

సుగు—కొందరికి నియమబద్ధ జీవితంయిష్టం. కొందరికి విశృంఖలత యిష్టం. ఏది సరైందో ఏదికాదో ఎవరికివారు నిర్ణయించటం. అనుభవించటమే జీవిత పరమావధి యేమో.

(తెర)

# కనువిప్పు



## ౪వ రంగము

(వీధిబడి, తాటి చివరలు పరిచి యుండును. తాత పాడుకుంటూ)

గురు— ఆత్మప్రదక్షిణము లేక్షణము మొదలిడెనో
క్షణమేని విశ్రాంతినే ఎరుగదీయువని.
రాత్రిందివము లెట్టు లారంభమాయెనో॥
అంతమే కనపడదు ఎంత కాలము కేని॥

ఆకసమ్మును గనగ నాశ్చర్య మొదవును
తుదియేమొ మొదలేమొ తోచదెవ్వాడుగాని
గ్రహ తారకాదులే క్రమమున నిల్చెనో
అంతుబట్టదు మనశ్చింతి మిగులునెగాని.

పంచ భూతముల శాసింప జాలిన దేదో
బోధపడ దిసుమంత బుద్ధి కెపుడేగాని
నేనంచు నాదంచు నుడువుచుందుబె గాని
నన్నునే నెరుగని నాకేమి తెలియును!

(నాగయ్య ప్రవేశం. పలక. బలపం. తాటిచదర. గురం కీర్తనలోనే నాగయ్య వచ్చి హార్మని వింటూవుంటాడు)

నా:—మా అజ్ఞానానికీ, దరిద్రానికీకూడా అంతు పట్టేటట్లు లేదు తాతా!

గురు—ప్రపంచంలో ధైర్యం లేనివాడికి తావులేదు. సరేగాని సరస యేదీ?

నా:—వస్తూవుండాలి. వాళ్ళ అమ్మకు గంజికాచి పోసింది. దోవలో వెంకుల్ని, సామేరునీ పిలుచుకుని వస్తానంది.

గురు—ఆలోచించగా మనం అనుభవిస్తున్న కష్టాలలో నూటికి తొంభైపాళ్లు మనఅజ్ఞానం వల్లనేఅని తోస్తుంది. వ్యక్తిగా చూచుకున్నా అంతే. సంఘంమొత్తంమీాదా అంతే ప్రతిదాన్నీ మనకర్మ అనుకోటం బాధ పడు తూనే అనుభవించటం. చిరాకు పుట్టితే పెళ్ళాన్ని పిల్లల్ని బాదటం. యిది మన దినచర్య అయింది.

నా—ఏం చెయ్యమంటావు తాతా? కూడూ కూడా దొరక టానికే తాతలు దిగివస్తుంటే మమ్మల్ని యేమిటో ఎగరమంటావెక్కడికీ?

గురు—కూడూ గుడ్డా కోసమే భావంలో పైకి యెగరమంటే ఎగిరేవాడికి పిక్కబలం కావాలి. ఆవేశం వున్నవా డికి ఆచరణ కావాలి మన అజ్ఞానం మనల్ని వదలితే గాని మన నిరాశాజాడ్యం వదలదు. ఒక్కంటు కొంతైనా వదలుతుందేమోననే యిప్పుడుపడే యీాతంటా లన్నీ అక్షరంముక్క వచ్చినంతమాత్రాన అన్నీ చక్క బడతయ్యనికాదు నాఅభిప్రాయం. ప్రపంచంలో చదు

వుకున్న అజ్ఞానులు అనేకులు కాని---

(ప్రవేశం వెంకన్న వెంకుల్ని చెయ్యిపట్టుకొని లాక్కొస్తూ)

సరస—చూడు తాతా! యీ వెంకులు యివ్వాళ పాఠ్యానికి రాడట ఎందుకు రాడో తాతకు చెప్పి శెలవు పుచ్చుకుపొమ్మని చెప్పి లాక్కొచ్చాను.

గురు—మంచిపని చేశావుగాని ముందు వెంకుల్ని వదిలిపెట్టు. వెంకులూ యెందుకు రావు నాయనా?

వెంకు—నీకు తెలియందేముంది తాతా! ఆ మామిడిచెట్టు పొలం మేము మా అయ్య నాటినుండి చేసుకుంటున్నాం గదా.

గురు—అవును.

వెంకు—దాన్ని వదలిపెట్టమని చినబాబు గారు కబురు చేశారట. తనకు వెంటనే స్వాధీనం చేసి రశీదు పుచ్చుకోవలసినదనీ లేకపోతే చెంబూ తప్పేల బైట పారేయిస్తాననీ రమణయ్యగారు బెదిరిస్తున్నారు. ఏ వేళప్పుడు చేలోవున్న గడ్డి కడియెం కాస్తా యింటికి తోలుకొనిపోయి నాలుగుగట్లు దున్నించుకు పోతాడో అని మేము నిత్యం కావలా వుండాలనుకున్నాం.

గురు—చినబాబుగారు వ్యవసాయం పెడతారా?

నా—ఇదంతా రమణయ్యగారి తంతు. నాచిన్నతనం నుంచీ యీయన యింతే. వాళ్ళ కళ్ళల్లో కారం కొట్టుతూ వుండటమే యీయన ఉద్యోగం.

వెం—కాదు తాతా! భూములు ఎవరు చేసుకుంటే వారివే నని శేపత్లో వచ్చిందటగా. అందుకని పొలాలు మనద

గ్గర్నుంచి తీసేసుకుంటారట చినబాబుగారు.

గురు—తీసుకుని నెత్తిన వేసుకుంటారా? ఎవరో ఒక కరుదున్నద్గా?

(ప్రవేశం సామేరు)

సా—ఏంతాతా చూచావా విచిత్రం మా బాడవపొలం వద లిపెట్టి తనకు స్వాధీనం చెయ్యాలంటున్నారు రమణ య్యగారు.

గురు—ఎందుకో.

సా—చినబాబుగారి ఆడరంట.

గురు—ఆయన వ్యవసాయం చేస్తాడా.

సా—ఎవరు చేసుకుంటే ఆరిదే నంటగా భూమి! అందుకనితీసే సుకుందామనుకుంటున్నారంట. ఆరిభూమి కాదన్నా మా మనంమాత్రం. మధ్య యీ రమణయ్యగారి దౌర్జన్యం యెందుకు?

గురు—క్షమాయించండి. ఇంతమందికీ పొలాలు వదిలిపెట్టమని కబుర్లు రావటంలో ఏదో రహస్యం వుండి తీరుతుంది. మీ కెందుకు. మీరు యథాప్రకారం వుండండి. సరసా పాఠం ప్రారంభించు.

సరస— కూలీలం కూలీలం; మేం
కృపణుల గుండెల గాలాలం॥

కోటీశ్వరునకు కూటికి పేదకు
చోటునొసంగని సువ్యవస్థకై
పాటుచెడని యీరాలముతో నిక
ధాటిగ పోరాటము సల్పంగా ॥కూ॥

వెన్నెముకే వజ్రాయుధమ్ముగా
కండరమే కోదండ చాపముగ
కడుపుచిచ్చె కాలానలమ్ముగా
కృత్రిమ భేదమ్ముల గూల్పంగా ॥కూ॥

(పరిస పాడుతూవుంటే అందరూ అంటూవుంటారు. ముగియగానే రమణయ్య ప్రవేశం. చేతులో పొన్నుకర్ర. కళ్ళజోడు నెత్తిన ఎండవేడికి వేసుకున్న తడికోళ్లాయి)

రమ—ఏంగురువులూ. ఏదో కళాశాల పెట్టావల్లేవుందే.

గురు—రండిబాబూ! నాగయ్యా అయ్యగారికి పట్టావెయ్యి. (రమణయ్య కూర్చుంటాడు) ఏదో నిశానీ పద్దులు కాకుండాఅక్షరంముక్క నేర్పుతున్నాను.

రమ—అవును. ఎట్లాగైన నాలుగుముక్కలు చదువుకున్నవాడి సంగతివేరే. ఏమీరాని మొద్దుకన్న ఒకమాటా, మంచీ తన, పర, చిన్న, పెద్ద భేదం తెలియాలన్నా పరిజ్ఞానం అవసరం. అందుకనే 'విద్యయొసగును వినయంబు వినయమునను' అన్నాడు.

గురు—అవునుబాబూ. తన, పర, తెలుసుకోవాలంటే చాలా జ్ఞానం అవసరం. తనదికానిదాన్ని తనదిఅనుకునేవాడు ఎంతఅజ్ఞానో తనదాన్ని తనదికాదనుకునే వాడుకూడా అంతే.

రమ—నేననేదీ అదే. మాటవరసకు యీవూరిపొలాలన్నీ చిన బాబుగారివిగదా. నువ్వెరగవు గనుకనా?

గురు—అయ్యో! నేనేమెరగనూ? ఊరంతావారిదే.

రమ—అదుగో ధర్మసూక్ష్మం తెలియటంలో గురువుల్ని చెప్పి

మరోకసని చెప్పాలి. మొన్న బాబుగారు నాపేర ఉత్త
రంవ్రాశారు. భూములన్నీ యికనుండి మేమేచేసు
కుంటాం. గాబట్టి ఎవరెవరి స్వాధీనంలోవున్నా వెంటనే
బకాయిలన్నీ ఏదోప్రకారం సరిచూచుకుని స్వాధీనం
చేసుకోవలసిందీ అని. ఇదుగో ఉత్తరంకూడా...

గురు—(గురువులు చేయిజాచును)

రమ—దాసికేం. నువ్వేం చూద్దుగాని. (బొడ్డులోదాచును)
ఈమాట మనవాళ్ళందరికీ చెప్పాను. మమహారాజు
లాగా యిన్నాళ్ళూ అనుభవించారు. ఇవాళ వారు
కావాలనుకుంటున్నారు కాబట్టి వారిస్వాధీనం చెయ్యే
టంధర్మం. అని చెప్పాను ఏమంటావు గురువులు.

గురు—బాబుగారు వ్యవసాయం చేస్తారా?

రమ—వ్యవసాయమే చేస్తారో, పొలాలు బంజరే పెట్టుకుం
టారో, వారి ఆస్తిగదా వారిని ఎవరేం అనేందుకు
ఏముంది? ఏమంటావు?

గురు—ఏమంటాను? వారట్లా చేసేందుకు వీలులేదంటాను.

రమ—ఏమిటీ? వారిపొలంవారు స్వాధీనం చేసుకోటానికి
వీలేలేదూ!

గురు—వారిపొలం వారి స్వాధీనంలోనేవుంది.

రమ—వీళ్ళందరూ వాటిని ఆక్రమించుకుని వదలనప్పుడు వారి
స్వాధీనం అనేమాటకు అర్థం యేముంది?

గురు—వీరి ఆధీనానికి లోబడే వారిపొలాలు అనిపించుకున్న
య్యి యిన్నాళ్ళూనూ. ఇవాళకూడా అంతే. బాబు
గారువచ్చి వ్యవసాయం చేసుకుంటే వదిలేందుకు వీళ్ళం

దగా సంసిద్ధమే.

రమ—అయితే వారు వ్యవసాయమే పెట్టుకుంటారు మహారాజు లాగా.

గురు—(అందరితో) వారికో పదియకరములకొండ ఖాళీచేసి యివ్వండయ్యా. వ్యవసాయం పెట్టుకుంటారు.

రమ—పొలం అంతానో?

గురు—పొలంఅంతా ఏమాత్రం వుడుమాత్రం ఒకదూ ఎట్లా వ్యవసాయం చేస్తాడూ.

రమ—చేస్తే నేం? చెయ్యక పోతేనేం? వారిపొలం.

గురు—మళ్ళీ అమాటే మాట్లాడకండి దయచేసి. పొలం బంజరుగా వుంచేహక్కు ఏమానవునకూ లేదు. వాడు రాజుగానీ, రాజులకు రాజుగానీ, ఈచట్టాలూ వ్యవస్థలూ ఉన్నదాన్ని సద్వినియోగం చేసేందుకేగాని సర్వనాశనం చేసేందుకు కాదు

రమ—పొలంఅంతా వారికి కావాలి. మరనాగళ్ళు పెట్టి దున్నించుకుంటూరు. మీకేం !

గురు—ఇన్ని కొయ్యనాగళ్లు, ఇన్ని కండలు తిరిగిన చేతులు ఖాళీగా వుండంగా వారిమరనాగలిని యీభూమి దున్ననీయదు. మూడుపూలల్లో భూగర్భం త్రవ్వేత్తి, పహాగాకో, పసుపో దాంట్లోపండించి, నోట్లకట్టలు సంపాదించి మమ్మల్ని వెధవలు చేద్దామనుకున్నారు కామాల్లు. మాప్రాణాలు పోయినా మేమందుకు ఒప్పుకోము. మాకు తిండి,గుడ్డ పుష్కలంగా లభించేటంతవరకూయీ పొలిమేరలోపొగాకు,పసుపు, చెరకు వేసేందుకువీల్లేదు.

రమ—ఏంగురువులూ. నౌకరీనుంచి తీసిపారవేసినకసి యీనా డు తీర్చుకుందామనుకుంటున్నా వల్లేవుంటే. బాబుగారి కొంపకి నిప్పుపెట్ట దలచావన్నమాట.

గురు—కొంపలకు నిప్పుపెట్టటం మాచేత గాదుబాబూ! అంత శక్తి మాకులేదు. ఉద్దేశమూలేదు. కాకపోతే యిది వరకంత అజ్ఞానంగా యీలోకంలో బ్రతుకలేమని మాత్రంగుర్తించాను

రమ—సరే దానికేంలే. నీఅభిప్రాయం నీది. పోనీ ఒకపని చెయ్యి. బాబుగారి క్రింద పొలాలు నేను చేయిస్తున్న ట్లుగా కూలినాగళ్లు నగైరా కట్టినట్లు రశీదులివ్వించు. నీవాళ్లు నిజాయితీకి నిలబడే మనుష్యులే అయితే ఆపని చేయుదువు.

గురు—మావాళ్లు నిజాయితీ మనుషులే.

రమ—అయితే రశీదులిప్పించు. బాబుగారి ఉప్పునీకు జ్ఞాపకం వుంటే ఏదీ-కానీ.

గురు—జ్ఞాపకంవుంది. (ఆలోచించుచుండును)

రమ—అయితే ఆలోచనెందుకు? కానీ.

గురు—అందుకనే రాయించను.

రమ—ఏమీ ?

గురు—మీారు చేయించలేదుకాబట్టి.

రమ—ఎవరు చేయిస్తున్నారు మరి?

గురు—ఎవరు చేయిస్తున్నారయ్యా? చెప్పరేం?

అందరూ—ఎవరో చేయించటమేమిటి? మేమే చేస్తున్నాం.

రమ—ఇంతకీ మీాకూ దుర్బుద్ధి పుట్టింది. ఈ పొయ్యేకాలపు

బుద్ధులు నిర్వ్యాకంకావు. అయ్యా బాబూ అని బాబును బ్రతిమాలుకొని మీ బకాయిలు మాఫుచేయించి మిమ్మల్ని ఒకఒడ్డున పడేద్దామనుకున్నాను. మీ కొంప కు మీరే చిచ్చు పెట్టుకుంటున్నారు.

నా—మా బకాయిలు యివ్వవలసినంతవరకు యిచ్చితీరుతాం మీరు మాఫుచెయించ నక్కర్లేదు.

గురు— చాటసంగతి బాబుగారూ వాళ్ళూ చూసుకుంటారు దయచేసి వారికి రమ్మని కబురుచేయండి.

రమ—యిక బాబుగారుకాదు బ్రహ్మదేముడుకూడా మీకు చెప్పలేడు. మీ తిక్కతీర్చేవారు వస్తారు. అపుడుగాని కాళ్ళబేరానికి రారు.

గురు—మీరుదౌర్జన్యంతో లొంగతీద్దామనుకుంటున్నారేమో అదిమాత్రం వట్టిభ్రమ.

రమ—ఈ రకాలు చాలాచూశాం. ఇదేం క్రొత్తగాదు. ఇటు వంటి బొప్పులు ఈరమణయ్యతలచుట్టూ కొన్నివందలు కట్టిఉన్నయ్యి.

నా—ఇది సామాన్యం దెబ్బకాదులెండి. బొప్పికట్టి ఊరుకోదు

గురు—నాగయ్యా ! (కోపంతో) ఏమిటి నీమాటలు? ఒళ్ళు తెలిసేనా ?

వెంక—ఎందుకు నాగయ్యా నోరుజారుతావు?

గురు—రమణయ్యగారూ ! ఇన్నిమాట లెందుకు? పొలాలు యథాప్రకారం వీళ్ళు వ్యవసాయం చేసుకోకుండా ఊరుకోరు. వాటిని మరొకరివశం చెయ్యటంకూడాకల్ల. ఈనాములన్నీ జిరాయితీలవుతున్నయని బాబుగారు

గాబరా పడుతున్నా రేమో. వారు భయపడవలసినపని లేదు రమ్మనండి. మీ క్రింద పనిచేసినట్లుగా రశీదులిస్తే మీరు జిరాయితీదారు అపుడామనుకున్నారు. ఆ దురాశ మానండి. మేమంత తమస్సులో లేము. నెమ్మదిగా కన్ను విప్పుతున్నాము.

రమ—కన్ను విప్పుతున్నా సరే. గంగలోదూకినా సరే. మీరు పడేపాట్లు కుక్కలుపడవు జాగ్రత్త. ఈ రమణయ్యకు కోపంవస్తే రావణయ్య అనుకోండి. [ప్రస్థానం]

(సరస పకపక నవ్వుతుంది. నాగయ్య వెంకులు వగైరా తలపంకింపు సూచన అభినయిస్తారు)

నా—మాబాగా సమాధానం చెప్పావు తాతా.

గురు—మీపక్షం చెప్పాననా?

వెంకు—మాపక్షమేమిటి. న్యాయం చెప్పావని.

గురు—న్యాయం మీకు వ్యతిరేకమైతే నిలబడతారా?

అందరు—ఆ! తప్పక నిలబడతాము.

గురు—వెంకులూ నీస్వాధీనంలో యెంత పొలంవుంది.

వెంకు—పది యకరాలు.

గురు—సామేరూ! నీచేతులలో?

సామే—ఆరు యకరాలు.

గురు—నాగయ్యా! నీచేతిక్రింద?

నా—మూడు యకరాలు.

గురు—రేపు జిరాయితీ అయితే నీపది యకరాలూ నీకే వస్తుంది కాదూ వెంకులూ?

వెంకు—ఓ. నాకేవస్తుంది. ఇందులో రమణయ్యగారెవరూ మధ్య.

గురు—నాగయ్య కెంతవస్తుంది.

వెంకు—వాడిపొలం వాడికొస్తుంది.

గురు—ఎంతఅని?

వెంకు—మూడు ఎకరాలు గామల్లు.

గురు—నీకెంతమంది పిల్లలు?

వెంకు—నాకింకా పిల్లలులేరు.

గురు—నాగయ్యకు?

వెంకు—ఆడికా. లేరూ అయిదుగురో ఆరుగురో.

గురు—పిల్లలకలవాడికీ మూడెకరాలూ? పిల్లలు లేనివాడికి పది యకరాలూనా?

వెంకు—ఆడికర్మం. ఆడిచేతిలో మూడెకరాలే వుండటమేమిటి?

గురు—అసలు యీపొలమంతా బాబుగారిదేగా మీకర్మం అనుకొని వదలిపెట్టండి.

వెంకు—అదెట్లా?

గురు—మరి ఇదెట్లా! అక్కడే పొరపాటు పడుతున్నావు. బాబుగారిపొలం వాడికి కర్మంవల్లం వచ్చిందికాదు. కర్మం వల్ల పోయేదికాదు. నీకూఅంతే. అవసరమైన దానికంటె యెక్కువ పొలమూ, స్థలమూ, సంపదా పూర్వంచట్టాలూ ప్రభుత్వాలూ తెచ్చిపెట్టినయ్యి. వాటిని పాటించవలసినఅవసరం యిపుడులేదు. అట్లాగే యిప్పటి ప్రభుత్వం తెచ్చిపెట్టే హెచ్చుతగ్గులు నోరు మెదల్చకుండా భరించవలసిన అగత్యం లేదు.

వెంకు—ఏం చేద్దామంటావు?

గురు—పొలం నీదికాదు. నీదికాదు. నీదికాదు.

అంజయ్యా—మరెవరిది ?

గురు—అందరిదీను.

అందరు—వ్యవసాయం ఎవరుచేస్తారు?

గురు—అందరూను.

అందరు—ఎవరనుభవిస్తారు?

గురు—అందరూను.

వెంకు—నాకాల్వాలంటే నాకాల్వాలని కొట్టుకుచావరూ ?

గురు—ఇప్పటికంటేనా ? ప్రక్కవాడు మూడంతస్తుల మేడలో ఉంటూంటే గుడిసెలోఉన్న నువ్వు ఆయనతో ఎన్నడైనా ఈవిషయంమీద పోట్లాడావా ?

వెంకు—లేదు.

గురు—ఎందుకని ?

వెంకు—నేనేకాదు ఎవరూ పోట్లాడలా.

గురు—అందుకనే రేపుఎవ్వరూ కొట్టుకోరు. చిల్లరతగాదాలు వస్తే వివేకంతో సర్దుకుంటారు. పీకలు కోసుకోరు

అందరు—గురువులతాతకీ జై !

గురు—జైలతో ప్రయోజనంలేదు. రేపు బాబుగారి సైన్యం వచ్చి మీదపడినపుడు తెలుస్తుంది మీపస.

నా—విరగబాదుస్తాము ఒకొక్కణ్ణి.

వెంకు—ప్రాణం తీసేస్తాము.

గురు—అదుగో. అయితే మీ ప్రాణాలు యిప్పుడే పోయినయ్యనుకోండి.

నా—ఏం?

గురు—న్యాయము, దౌర్జన్యము యీ రెండింటికి ఆకాశానికీ భూమికీ వున్నంత దూరముంది. దౌర్జన్యాన్ని సాయం తెచ్చుకోంగానే న్యాయానికి బలంపోతుంది.

వెంక—ఏం చేద్దాం.

గురు—ఏమీ చెయ్యొద్దు. మనపని మనం చేసుకుపోతూవుం దాం. అడ్డువచ్చినవారి అడ్డును పాటించకుండా శాం తంగా అవతలకు తోసుకుంటూపోదాం. అవసరమైతే ధర్మంకోసం ప్రాణం అర్పిద్దాం. బాధ్యతలు పాటింపని వారికి హక్కులు లేవు. చావుకు సిద్ధపడనివానికి స్వాతంత్ర్యం లేదు. విజ్ఞానం లేనివారికి ప్రజారాజ్యం లేదు. విజ్ఞానం.

అందరు—వర్ధిల్లాలి.

సరస—సంఘవ్యవస్థ.

అందరు—మారాలి.

సరస—

వ్యవస్థ మారాలీ
యీఅవస్థ తొలగాలి ॥
కొందరధికులై కులుకుచుండగా
ఎందరో యథమత కుందుచునుండే ॥
అరనిముసము పనిచేయని వారికి
అఖిల భోగమ్ము లమరి తేరగా

అహర్నిశలు కృషి చేసినగానీ
అన్నవస్త్రములకే కరవాయీ ॥
అయ్యా బాబూ చిత్తమ్మనగా
ముయ్యినోరు ఛీ ఛీ పోపోమ్మని
చెయ్యి చేసికొన మీదబడెడి యీ
అయ్యల ఆటలు కట్టవేగమే ॥
(తెర)

# కనువిప్పు



## ౫ వ రంగము

(పట్టణంలో భూపాలరావు బంగళా. సుగుణ, భూపాలరావు విచారంగా కూర్చొనిఉంటారు)

సుగు—నేనిల్లా అవుతుందని వూహించనైనా వూహించలా.

భూపా—అదే Luck అంటే. మన Horse పదిగజాల్లో ఓడిపోయింది,

సుగు—ఇంత నమ్మకంలేకపోతే ఒక్కపందెముమీద పన్నెండు వేలు పెట్టకపోదును.

భూపా—మొన్న నేనుపెట్టి మోసపోయినదిచూచికూడా నువ్వు నిన్న సాహసించటం...

సుగు—మీకుకాకపోతే నాపేరుమీదనన్నా కలిసివస్తుందేమోనని ఆశించాను.

భూపా—వద్దందామని నోటిదాకావచ్చి ఏమనుకుంటావో అని నేను ఆగాను. అయినా అదృష్టవశాత్తు నీ పేరుమీద

రానేవస్తుందేమోననికూడా ఉబలాటపడ్డాను.

సుగు——ఈ పైకంకూడా సురూప్ చెంద్ దగ్గరేనా ?

భూపా——కాదు, కుశాల్జీ.

సుగు——ఏం కుశాల్జీ దగ్గరకు పోయారేం?

భూపా——ఎంతెసు తెస్తాం సురూప్ చంద్ దగ్గర.

సుగు——ఏమాత్రం అయిందేం ?

భూపా——ఎంత కాకేం......సిలార్——

('అయ్యా నా...'——కేక రాక)

భూపా——ఆ ఖాతా పుస్తకంఏదీ ?

(సిలార్ తెచ్చియిచ్చును)

భూపా——[తీసిచూచి] ఇరవైతొమ్మిది వేలదాకా అయింది.

సుగు——ఇద్దరికీ కలిసా ?

భూపా——బాగుంది ! ఒక్క సురూప్ చంద్ కే.

సుగు——ఇదిగాక కుశాల్జీకి——గుడ్డలకొట్లోనూ...
Jewe'ry Mait లోనూ

భూపా——వచారీషాపులలోనూ, ఫ్యాన్సీస్టోర్సులోనూ

సుగు——ఇన్ని చోట్ల యింత అప్పు తీర్చటం మెలాగో
విచారించారా ?

భూపా——విచారించినవారు అప్పుచెయ్యరు. చేసినవారు విచా
రించరు.

సుగు——మీ హాస్యం మాటలకేంలెండి.

భూపా——నన్నుకూడా ఏడవమంటావా?

సుగు——అదికాదండి. ఇదంతాతీరి మర్యాదగా మనంబయట
పడేది ఎల్లాగాఅని.

భూపా—బకాయిలు వసూలుచేసిన బాపతూ, పొలాలు అమ్మిన బాపతూ వెంటనే ఒక యాభైవేలు పట్టుకు రమ్మని రమణయ్యగారికి వ్రాశాను. నిన్నటికే రావలసింది.

సుగు—వసూలు కాలేదేమో.

భూపా—ఏకబురూ చెప్పటానికైనా రమ్మని వ్రాశాను. ఆ ముసలి ముండాకొడుకు వాడిఉద్యోగం తీసేశాననే కోపంతో ప్రతిదానికీ అడ్డు పడుతున్నాడట.

సుగు—అసంభవం. తాత ఎప్పుడూ అట్లా చెయ్యడు.

(ప్రవేశం రమణయ్య)

రమ—ఆపిచ్చి మిమ్మల్నిముంచింది. వాడే మీకొంపతీశాడు.

భూపా—నేను చెప్పటల్లా.

రమ—చెప్పటమేమిటి బాబూ. పొలంలోనుంచి ఒక్కడు కదలడు. బకాయి యివ్వడు. ఎవరి కమ్ముదామంటే యెవరు కొంటారు? స్వాధీనంకాని పొలాల్ని నెత్తిన కొట్టుకుంటారా?

భూపా—ఇంతకీ ఏమైంది?

రమ—ఏమీపని జరగలేదండి.

సుగు—బొత్తిగా వసూలుకాలేదా?

రమ—నాక్రిందవున్న యాభై యకరాలూ బాబుగారి చిత్తం వుంటే నాకిస్తారని అందుకు మింజుమలే అక్షరాలా అయిదువేల రూపాయిలు తెచ్చాను.

భూపా—మీక్రింద నున్నపొలం ఆడొంక ప్రక్కదా?

రమ—కాదు. చెరువుతూము మొగదలది.

సుగు—అయిదు వేలా?

రమ—అమ్మా, కొనేవా డొకడుంటే కాదుటమ్మా ధరవలి కేది.

భూపా—సరే, దాని కేంలేండి. పొలం మీరట్లాగే తీసుకుందు రుగాని. ఇప్పుడు మార్గం?

రమ—రెండులారీల రిజర్వు పోలీసుల్ని తీసుకు వెళ్ళి మక్కెలు విరగదన్ని స్తే తిక్క వదులుతుంది.

సుగు—అది తగనిపని.

రమ—మీకీవిషయాలు తెలియవు. ఊరుకోండి తల్లీ.

భూపా—నీకు తెలియదు; ఊరుకో సుగుణా.

సుగు—తాతను పిలిచి....

రమ—పామును బుజ్జగించి. ..

సుగు—మీరు ప్రతిదీ అట్లా తీసివేయకండి రమణయ్యగారూ తాతను నేనెరుగుదును.

రమ—మీరెరిగిన తాత వేరు. వాడు మీ వంశమునకు తరతరముల నౌకరు. యిప్పటితాత వేరు— ఆనౌకరీ నుండి బలవంతంగా నెట్టివేయబడిన దిక్కు మొక్కులేనిపక్షి. వెనక ముందులు, భయభక్తులు, చిన్న పెద్ద, తారతమ్యాలు లేని దుర్మార్గుడు. యింతకూ అవిటివాళ్ళకు కాళ్ళు వచ్చినయ్యి.

సుగు—తాత యింత ద్రోహం చేస్తాడని నేను నమ్మలేను.

భూపా—మానవ ప్రవృత్తినిగుర్తించేసామర్థ్యం నీకు లేదు. రమణయ్యగారూ, పోలీసు స్టేషన్‌కు పోదామా

రమ—శుభస్యశీఘ్రం.

భూపా——పైకం యిటు తెండి. డబ్బు లేకుండా యేపనీ జరుగదుగా
రమ——ఆ కాస్త ముక్కా రాసేస్తే....
భూపా——తొందరేముంది? తీరిగ్గా రాసిస్తాను.
రమ——నేను స్వతంత్రుణ్ణి కాదు చూడండి. తీరా యింటికి వెళ్ళితే పెద్ద కుర్రవాడు నిగ్గదీస్తాడు. ఏంనాన్నా డబ్బిచ్చావు సరే పొలం రాయించుకున్నావా అని.
భూపా——సరే కాగితం యివ్వండి. సంతకం పెట్టుతాను. తరువాత మీరు పూర్తి చేసుకుందురుగాని.
రమ——దానికేం. మహారాజులాగా.

(రమణయ్య కాగితం యివ్వగా భూపాలరావు సంతకం పెట్టును. రమణయ్య కాగితంనంచి భూపాలరావు చేతిలో పుంచును.)

భూపా——[సుగుణతో] అవసరమైతే అటునుంచి అటే అగ్రహారం వెళ్ళుతాము. నువ్వు యింటిదగ్గర జాగ్రత్త
రమ——వెళ్ళొస్తాను తల్లీ నమస్కారం.
సుగు——నమస్కారం (రమణయ్య భూపు ప్రస్థానం.)
సుగు——ఈ ఓటిపడవకు నదీ మధ్యంలో తుపాను కూడా వచ్చింది.

(బైటనుండి హమ్మా అని పిలుపు)

సుగు——రా, సిలార్

(ప్రవేశం సిలార్)

సి——పందెంలో మందీ ఓడిపోయిందని తెల్సేతల్కి కుశాల్జి హాద్రీపడ్డాడ్. హిప్పుడే పైసా వసూల్ చేస్తామ్ ఉన్నది తొలున్నట్లు గోల్ఖ్యాడగొట్టి లాగేస్తాంహంటూ వున్నాడ్

యేమేం చేస్తాడో యేమో.

సుగు—(భీతితో) మీఅయ్యగారుకూడా లేరు.

సి—హెక్కడికి పోయాడ్.

సుగు—ఆయన పైకంకోసం అగ్రహారం వెళ్ళారు.

సి—హెక్కాకనిపించాపోతే కుశాల్జీ హగ్గురారం దోషూ తీస్తాడ్ గాని హూరుకోడ్.

సుగు—ఏంచేద్దాం!

సి—మనం హిక్కావుండేది అచ్ఛా లేదుహమా. ఒక్క కుశాల్జీ వస్తే వాడితో హందరు వచ్చేస్తార్ గాని హొక్కరూ వూరుకోర్. మనంకూడా హగ్గురారం వెళ్లేది సాలా సాలా మంచిది.

సుగు—సరే. నీసలహాకూడా బాగానేవుంది. నాకూ అగ్రహారం వెళ్లాలని యెంతగానో వుంది. ప్రయాణ సన్నాహం చెయ్యి. మనమూ వారితోపాటే అగ్రహారం చేరుకుందాం.

సి—సిత్తం.

(సిలార్ వెలుపలకు, సుగుణ యింటిలోనికి ప్రస్థానం)

# క ను వి ప్పు



## ఉ ప రం గ ము

(పోలీసు కష్టడీలో - నాగయ్య గురువులుకు కలిపి సంకెళ్లు - వెంకులు సామేలుకు కలిపి చేతులకు సంకెళ్లు. పోలీసుకానిస్టేబుల్ అల్లం. సబ్ యిన్ స్పెక్టరు పోతునాయుడు)

అల్లం—దేశంవాళ్ళసొమ్ము తేరగా......తింటావ్ నీకీ..... నీయబ్బా - నాయబ్బా సంపాదించి యిచ్చాడ్ బే. మనదీ హావటానీ్క.

నా—బే - గీ- అన్నావంటే జాగ్రత్త. మర్యాదగామాట్లాడు.

అల్లం—జాగ్రత్త హంటావ్ నీకీ మళ్ళీ. ఒళ్ళు పగిలీపోతాది. కులంవాడనీ యిన్స్పెక్టరుగారు కలికారం నూపిస్తే నీకూమదం పెరిగిపోయింది. అదిమి నాలుగు తంతే దిగి పోతుంది ఆకాస్తా.

గురు—మీాకీ అధిక ప్రసంగము ఎందుకు సాయబ్బుగారూ! కావలి స్తేకెఫీయత్తు వ్రాసుకోండి చెబుతాను. మర్యాద

ఇచ్చి మర్యాద తెచ్చుకోండి. మేమేమీ దగాకోర్లం కావు. పారిపోము.

అల్లం—దొంగలు పెట్టుం ఉంటారో హింకా.

పోతు—చుప్రిహహో అల్లం. నీ పేరేమిటి తాతా!

గురు—గురువులు.

పోతు—పని?

గురు—చదువు చెప్పటం.

పోతు—మాష్టరు పనా?

గురు—అంతమాటలు ఎందుకులెండి. పీధిబడి.

పోతు—పీళ్ళందరికీ దురుపదేశం చేసి పొలాలు వప్పగించవద్దని చెప్పానట నిజమేనా?

(ప్రవేశం భూపాలం-వృ - రమణయ్య)

భూపా—వీడే అన్నిటికీ మూలకారణం.

గురు—నేనా బాబూ!

రమ—నేనా అంటావేం మళ్ళీ.

గురు—అవును నేనే. నాయుడుగారు ఏమిటో ప్రశ్నించారు.

పోతు—పొలాలు వప్పగించ వద్దన్నావుట నిజమేనా?

గురు—ఎవరికి?

పోతు—బాబు గారికి.

గురు—అడిగిన దెవరు?

రమ—నేను.

గురు—ఏమని?

రమ—ఏమనో.

గురు—ఆగండి! వెంకులూ! వారేమని అడిగారో చెప్పు.

వెంక—తమరైతులుగా, మనం పొలం చేస్తున్నట్లు కూలి రశీదు లివ్వమన్నారు.

రమ—అబద్ధం.

పోతు— బకాయి యివ్వక్కర్లేదు. గవర్నమెంటులో కలిసి పోతుంది అంతా. అని చెప్పావట నిజమేనా?

గురు—ఇది యెవరు చెప్పారు?

రమ—నేనే!

గురు—రైతులిచ్చిన అయిదువేల రూపాయలకు యింకా రశీదులివ్వరేం?

రమ—యిదోపచ్చి అబద్ధం. రాసుకోండి నాయుడుగారూ!

గురు—కనీసం తూము మొగదల యాభై ఎకరాలన్నా సాగు చేస్తున్నట్లు చూపేందుకు కూలి రశీదు లిప్పిస్తే చాలా భాగం బకాయి చేయిస్తానని చెప్పారా? లేదా?

రమ—నేను- నేను- నేను- ఎవరికి ఎప్పుడు చెప్పాను.

భూపా—వాళ్ళకు చెప్పలేదులెండి నాకు చెప్పారు. ఏదీ నేను సంతకం చేసిన కాగితం పైకితీయండి.

రమ—అది క్రోవర్ గా పెద్దబ్బాయి తీసుకున్నాడు.

భూపా—నాయుడుగారూ! నీ జేబులో నాసంతకం కాగితం ఉంది. తీయించండి చల్లగా!

రమ—అయినా వుందేమో చూస్తాను. (చూచి) ఇదుగో వుంది. నాయుడుగారూ! వుంది యిదుగో. అయినా యిప్పుడు దీంతో ఏంపని? ఆపని తరువాత చూసుకుం దాం లెండి.

భూపా—మిగతా పనులు తరువాత చూసుకుందాం లేండి.

ముందు నాయుడుగారూ! వాళ్ళసంకెళ్ళు విప్పివేయండి.

(కిరసగా అంగరు సంకెళ్ళూ విప్పుతీస్తారు)

భూపా—యీయాకనకు వేయండి. (ప్రవేశం సుగుణ)

సుగు—ఆగండి వేయవద్దు. ఆగండి. ఎవరూ పారిపోయేవారు లేరు. సంకెళ్ళు వేసినంత మాత్రాన వచ్చేఅవమానం గాని, వెయ్యకపోతే వచ్చే గౌరవంగాని లేవు.

గురు—అమ్మా! సుగుణమ్మగారూ! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు కని పించావు తల్లీ! మాఅమ్మ కబురు పెట్టవయ్యా అని ఈరమణమ్మగారినియెన్నో సార్లుబ్రతిమిలాడుకొన్నా ను. నేనుగా కబురు పంపితే యేమనుకొంటారో అని సాహసించ లేక పోయాను.

సుగు—యిప్పటికైనా వచ్చావుకదా! తాతా! యింతతిరుగు బాటు చేస్తావని అనుకోలేదు కలలోనైనా.

భూపా—ఆగు! సుగుణా! తిరుగుబాటుకాదు. తాత సరిగానే చేశాడు. విను. యేంచేశాడో విందాం.

సుగు—తాత సరైనపని చేశాడని మీరనేటలనా! ఆహా! నా జన్మ ధన్యం అయింది

గురు—అమ్మా. వీళ్ళందరూ ఈ యీ పొలాల్ని నమ్ము కొని తరతరాలుగా బ్రతుకుతున్నారు. వీళ్ళ తాతలూ, తండ్రులూ, వీళ్ళూ తమతమ చెమటోడ్చి ఈ పొలాల్ని పదును చేశారు. ఈనాడు వీళ్ళని వదలి పొమ్మంటే యెక్కడికి పోతారు? అట్లాగే మీరూ వదలలేమంటారు. మీరూ దాన్నే నమ్ముకోండి. కన్న తల్లికి పిల్లలు బరువు కారు. కానీ ఒకరినోట్లో ఒకళ్ళు

మట్టి కొట్టుకునే పద్ధతి మానాలి. (ప్రవేశం కుశాల్టీ)

కుశా—మానోట్లో మట్టి కొట్టావదు.

గురు— యేమిటని.

కుశా—మాకూ హీయనాహిరవైవేలు శాకీ.

గురు—నీకెక్కడిదా సొమ్ము?

కుశా—హెక్కడిదీహంటే—హెక్కడిదీ... మాదే.

గురు—అది మిగులుసొమ్ము ఆగు- - -

కుశా—మిగిలీ పోయిందీ.....

గురు—ఆగవయ్యా!— అంచేత వీళ్ళను వేరుచేయటానికి ఎవరు ప్రయత్నంచేసినా ఆటంబాంబు వేసినంత పని అవుతుంది. అందులోనూ ఈ వ్యవహారంలో జోక్యం కలిగించుకొని యిటు వీళ్ళకుగాని, అటు బాబుగారికి గాని కాకుండా చేసేందుకు రమణయ్యగారు చాలా పాటుబడ్డారు. అది యిప్పటి పతితసంఘంలో పెద్దమనుష్యుల ప్రవృత్తిగానే భావింపబడుతోంది. కాబట్టి సుగుణమ్మగారు వారిని క్షమించటంలో నాకుకూడా అభ్యంతరం లేదు—బాబుగారు తమపొలం తీసుకోవచ్చును. గాని వీళ్ళకడుపులను కాలదన్ని కాదు. బకాయి వసూలు చేసుకోండిగాని వీళ్ళజీవితాలు వికావికలు చేసి కాదు.

భూపా—ఏం చేద్దామో నువుచెప్పుతాతా! నీ సలహాప్రకారం చేయుటకు నేను సిద్ధంగా ఉన్నాను.

గురు—ఊళ్ళోవుండేపొలం పసిపిల్లబాలాదిదీని. ముసలిముతకా కుంటీ గుడ్డీఅంతా దానిమీద బ్రతకవలసినవారే. ఎవ

రికితగ్గపని వారుచేయాలి. ఉన్న దానిలో ఎవరిఅవసరా న్ని బట్టి వారు అనుభవించాలి. బాబుగారు పట్నంలో కూర్చొని యిక్కడిఫలసాయం అనుభవిద్దామనుకుంటే నేడుకాకపోతే రేపైనా ఎదురుతిరుగుతుంది లోకం. మీరూ దీన్ని నమ్ముకుంటారా నమ్ముకోండి. కాదం టారూ తెగ తెంపులు చేసుకోండి.

సుగు—మేము యిక్కడే ఉండిపోతాము.

కాశా—మమ్మల్ని నట్టేట్లో ముంచుతావ్ మీకీ

గురు—ఆగవయ్యా! నీవు మునిగే దేముంది? తేలేది ఏముంది? నువ్వు యిప్పుడు మునిగిలేవు కనుకనా? నీదగ్గర వుండే కాగితాలూ, నాణాలే నీసొమ్మని భ్రమపడు తున్నావ్ వారివారి జీవితాలనే పాచికలతో వ్యాపార చదరంగ మాడి డబ్బు కూడపెట్టుతున్నా ననుకుంటున్నావు. నీకు త్వరలోనే కనువిప్పు జరుగుతుంది. నీకు యిరవై వేలక్రింద 20 యకరాలు కొండ్ర యిచ్చాం. రా! వ్యవసాయం చేసుకుంటావా చేసుకో. లేకపోతే ఈ సోమరిధనం నీచేతులలో వుంటే నిన్నూ, దేశాన్నీ కూడా పాడుచేస్తుంది.

రమ—గురువులు చెప్పింది చాలా బాగుంది.

భూపా—ఇప్పటికి రమణయ్య గారికికూడా కనువిప్పు కావటం చాలా మంచిది.

గురు—రైతులందరూ తమతమబకాయిసొమ్మే కాకుండా నగ లూ, నాణాలూరూపకంగాఉండే తమధనంయావత్తూ తీసుకోస్తారు. మరమ్మతుకోరుతున్న చెరువులను, కాల

వలను పురస్కృతు చేయించటం జరుగుతుంది. త్రోవ డొంక బాగుచేయటంలో వయసువచ్చిన మగవాడు, ఆడది నడుంకడతారు. తిండిలేకపోవటం అంటూ ఉండకూడదు. కష్టించేవాడికి కూడూగుడ్డకూ, తృష్ణగల వాడికి విద్యా విజ్ఞానానికీ ఏనాడూ లోటువుండదు. ఆబాలగోపాలానికీ శాంతి సౌఖ్యాలు లభించే గ్రామ స్వరాజ్య వ్యవస్థను అందరం కలసి నిర్మించుకొందాం.

నా—భేషుగ్గా వుంది తాతా! భేషుగ్గావుంది.

(పాడుకొంటూ సరస ప్రవేశం) అంతా సరసతో కలసి పాడుతారు.

సరస— మా రాజ్యమే రాజ్యము
భువి స్వర్గ సామ్రాజ్యమీ రాజ్యము.

అన్న వస్త్రములకై
అగచాట్లు లేకుండ
చల్లగా శాంతిగా
సాగి పోతుందేటి ||మా||

రాట్నలక్ష్మి దయను
రంగైన వస్త్రాలు
క్షేత్రలక్ష్మి దయను
చక్కన్ని ధాన్యాలు
కొల్లకొల్లగ నుండ
కోరికలు లేకుండ

చల్లగా శాంతిగా
సాగి పోతుండేటి ||మా||

అమృతమ్ము త్రోసి రా
జను జీవనదులూ
ఆదర్శ శిఖరమ్ము
లందుకొను గిరులూ
ఆనంద మొదవించు
ఆరామ తతులూ
భూ నందనమ్ములౌ
భూరి గ్రామములూ |మా|

(తే॥)

 యిందలి గేయములు మా సోదరులు రామచంద్ర శాస్త్రి, సూర్యనారాయణగారల రచనలనుండి గైకొన బడినవి.

రచయిత